ఓం

# మ ధు రా ద ర్శ ము

## మొదటి ప్రకరణము

పూర్వము కలశంబునం దుద్భవిల్లిన ద్రోణుండును, పృషత పుత్రుండగు ద్రుపదుండును వేదధనుర్వేదాదుల నిష్టసఖులై యగ్నివేశులతోడ నభ్యసించిరి. కాలక్రమమున ద్రుపదుండు పాంచాలదేశంబునకు రాజయ్యె. పూర్వవాగ్దానమును బాల్యస్నేహమును బురస్కరించుకొని, భారద్వాజుండు ధనార్థియై యతనికడకరిగి యవమానితుండై హస్తిపురికింజని యఖిల కురుకుమారులకు నెల్ల శస్త్రాస్త్రవిద్య కఱపుచుండె.

ఇట్లు దనవలన విలువిద్యగఱచిన శిష్యులం జూచి "నాకవమానంబు చేసిన పాంచాలు నోడించి పట్టితెండు. ఇదియ నాకు గురుదక్షిణ" అని ద్రోణాచార్యుండు పనిచె. వారును ద్రుపదుపయింబోయి వానిచేత నిర్జితులైరి. అర్జునుండు ద్రుపదుతోడ మహాయుద్ధంబుచేసి, వానింబట్టుకొనివచ్చి, ద్రోణునకప్పగించె. ద్రోణాచార్యుండు దయాంతఃకరణుండై యుల్లసంబులాడి యోడకుం బొమ్మని ద్రుపదువిడిచిపెట్టె.

కాని పృషత నందనుండు మాత్ర మవమానతప్తుండై పెద్దయలిగి "సంగరాంగణంబున ద్రోణుని నిర్జించునట్టి పుత్రుని నర్జునునకు దేవియగు పుత్రికను బడయుదు" నని బ్రహ్మవిదులైన బ్రాహ్మణుల నివాసంబునకుంజనియె. అందు నిత్యం

బును బ్రాహ్మణోపాస్తి చేయుచు, భైక్షసంభావిత కుటుంబ భారుండై ఘోరతపోవృత్తినున్న యాజుంగని నమస్కరించి తన్నుం గృతకృత్యుని జేసినచో "లక్షగోధేనువుల" నిత్తునని ప్రార్థించె.

అయ్యాజుండును యాజకర్మంబున కొడంబడి యజ్ఞ ద్రవ్యంబులు సమకట్టుకొని నిజసోదరుండగు నుపయాజుండు సహాయుండుగా సాత్రామణియయిన కోకిలాదేవి పత్నిగా ద్రుపదునకుం బుత్రకామేష్టి చేయించె. అందు మంత్రాహుతులం దృప్తుండయిన యగ్నిదేవువలన జ్వాలాభీలాంగుఁడు వాల బృహచ్చాపధరుఁడు కిరీటాలంకారుఁడునగు నొకపుత్రుండును, అసితోత్పల కోమలామలాంగియు ఉత్పలసుగంధియు దివ్యతేజముదాల్చిన యొక్క కుమారియు, జ్వలనకుండము నందుద్భవిల్లిరి. ఇట్లు పుట్టిన యాకొడుకునకుం గూతునకును ధృష్టద్యుమ్నుండును గృష్ణయు ననునామధేయంబు లాకాశవాణి జనవినుతంబులుగా నుచ్చరించె.

ఇట్లు ద్రుపదుండు లబ్ధసంతానుండై సంతసిల్లి యాజునకు యథోక్త దక్షిణలిచ్చి పూజించె.

ద్రౌపదీ ధృష్టద్యుమ్నులును శుక్లపక్ష చంద్రునింబోలి యభ్యుదయముగాంచి మించుచుండిరి. కాలక్రమంబున ధృష్టద్యుమ్నుండు ధనుర్వేద పారంగుండయ్యె. ద్రౌపది వివాహప్రాప్తయయ్యె.

ఇట్లుండ ద్రుపదుండొకనాఁడు మంత్రిపురోహిత విప్రసన్నిధిని "కుంతియుఁ బాండవకుమారులును లక్కయింటిలో

నుగ్రానలదగ్ధు లైరని ధరామరముఖ్యుల వలన నెఱింగితి. ద్రౌపదిని దేవేంద్రనందనునకు దేవిఁజేయఁ బ్రీతితోఁ గాంక్షించితి. ఇట్లు విఘ్నమాచరించుట విధాత్రునకుఁ బాడియా! మహాధ్వరమునఁ బుట్టిన యీ సరసిజాక్షిని నెట్టులొరులకునీనేర్తు?" అని దుఃఖపరవశుం డగుచుండ.

అట్టియెడఁ దత్పురోహితుండు, "రాజా! పాండవుల గుఱించి బహువిధంబులగు నిమిత్తంబులు చూచితి. ఎందును వారలకు నగ్గు లేదు; మీఁదుమిక్కిలి లగ్గగు. ఇదియుంగాక యనుకూలములగు నుపశ్రుతులుం బెక్కులు గానవచ్చెడి. పాండవులు పరలోకగతులుగారు. పరమానందంబున నున్నవారు. ఇది తప్పదు. వారలెందుండిరేనియు నిటకువత్తురు. నీవును శాంతచిత్తుండవై స్వయంవరంబిప్పురంబున ఘోషింపం బంపుము. ఇది కన్యాదానంబునందు రాజులకు శాస్త్రచోదితంబు" అనిన ద్రుపదుం డూరడిల్లి పౌషమాసంబున బంచమియు రోహిణి నాఁడు స్వయంవరంబని ఘోషింపం బంచె. మఱియు నేఁకిని మోపెట్టను, దివ్వను, శక్యంబుగాని దృఢకార్ముకమును దివమున దవ్వైదిరిగెడు కనక మత్స్యయంత్రమును జేసి భేదించిన వానికిఁ దన కూతు నిత్తునని తెలిపి పరమానందంబునం బొదలుచుండ అది యిట్లుండె.

# రెండవ ప్రకరణము

లాక్షాగృహ దహనానంతరము కుంతియు పాండవులతిప్రయాస ప్రయాణంబున మత్స్యత్రిగర్తకీచకాది విషయంబులు గడచి యేకచక్ర పురంబను నగ్రహారంబు ప్రవేశించిరి. అందు వారు జటాజిన తరువల్కల ధరులై వేదాధ్యయనము చేయుచు బ్రహ్మచారి వృత్తితో ఒక విప్రగృహంబున విడిసి యుండిరి.

అప్పురంబున వారు భిక్షావృత్తి జీవించు చుండిరి. ప్రతి నిత్యము భైక్ష భిక్షాపూర్ణమైన యయిదు పాత్రములను దమ తల్లికి నివేదింతురు. ఆమెయుఁ దత్పదార్థమును రెండు భాగములు చేసి, యందొక్కభాగంబు భీమునకుంబెట్టి తక్కిన భాగంబు తానును గొడుకులుం గుడుచుచు, నిట్లు కాలంబు గడపుచుండ.

ఇట్లు కొన్ని దినంబులు వారు సుఖంబున్నంత నొకనాడు బ్రాహ్మణుండొకండు ద్రుపదపురంబున నుండి చనుదెంచి, విశ్రమార్థియై, పాండవులున్న గృహంబున విడిసియుండ. గుంతీదేవి కొడుకులుం దానును నవ్విప్రు నతిభక్తినుపాసించి, "అయ్యా! యెందుండి వచ్చితిరి? ఏదేశంబులు రమ్యంబులు? ఎందుల రాజులు గుణవంతులు?" అని యడిగిన నవ్విప్రుఁ డిట్లనియె.

"ఎల్లదేశంబులును, తద్రాజులచరిత్ర సంపదలను జూచితి. ద్రుపదునిదేశముతోఁ బోల్పనర్హములగునవి యెందు దేశంబులు లేవు. సర్వసద్గుణంబులఁ బరరాజులెవ్వరు ద్రుపదుఁ

బోలలేదు. ఆద్రుపదుండు తనకూతు, నయోనిజను, నగణ్యపుణ్య లావణ్య సమన్వితను, అభిమతుండైన రాజపుత్రునకు వివాహంబు సేయంజాలక స్వయంవరంబు రచించు చున్నవాఁడు" అని చెప్పి యరిగె.

దానివిని పాండునందను లందులకుం బోవనెంచిరి. కొడుకుల యభిప్రాయం బెఱింగి కుంతీదేవి యిట్లనియె.

"ఇందుఁగడు పెద్దకాలముంటిమి. ఇంకెంతకాలమున్నను మనకగులాభ మేమి! ఎప్పుడు నొరులయింటిపొత్తుననుంట యుచితమే! దక్షిణ పాంచాలదేశంబులు కరంబురమ్యంబులని వింటిమి గదా! పాచాలపతియుఁ బరమ ధార్మికుండఁట; అందుల కుం బోదము.

పాండవులును సంతుష్టాంత రంగులై "మీ పంచినయట్ల సేయంగలవార" మని తల్లితోఁ బలికిరి. తమ యున్నయింటి బ్రాహ్మణునకుం జెప్పి వీడ్కొని, మహోగ్రనగంబులు, సరసీ వనంబులు, నేఱులుఁ దుస్తరవిపినంబులుగడచి, నిరంతరగతి నేగు చుండిరి. మార్గమధ్యమున వేదవ్యాస మహామునీంద్రుంగాంచి, నమస్కారంబు గావించిరి.

అమ్మునీంద్రుండును, వారలఁజూచి "మీరు ద్రుపదు పురంబునకుం జక్కనరుగునది. మీకు లగ్గగు" అని హెచ్చరించి యంతర్ధానుండయ్యె.

పాండవులు జననీసహితం బనవరతంబు రాత్రులుం బవళ్ళును బయనంబు వోవు వారొక్కనాఁ డర్ధరాత్రంబున గంగా స్నానాభిలాషం జేసి ప్రకాశార్థంబును రక్షణార్థంబుగా నొక్క

కొఱవి చేతఁబట్టుకొని, యర్జునుండు ముందు నడచుచుండ నందఱు పిఱుందన అరుగుచుండిరి.

అంతకుమున్న యంగారపర్ణుండను గంధర్వకుమారుండు ప్రియాంగనాసహితంబు గంగకు జలక్రీడార్థంబు వచ్చె. అతఁడు పాండవుల పాదధ్వని విని యలిగి, విల్లుగొని, గుణధ్వనిచేసి "నన్ను డాయకుండుఁడు, నేను కుబేరసఖుండ నంగారపర్ణుండ. నేనిందు విహరించుచుండు. ఇవ్వనంబు గంగ[illegible] నంగారపర్ణి యను పేరిట జగద్విదితంబుగానుండు. దీనిమానవులు చొరనోడు దురు, పొండు" అనిన నర్జునుండు "పుణ్యభాగీరథి యందఱకు సేవ్యంబై నీయొక్కనియదియే" యనియె.

అంత వారిరువురు బిరుసులు పల్కికొనుచు గోపంబులు రెట్టింపఁ బోరుచో నంగారపర్ణుండు నిర్జితుండై, ధర్మరాజుచే నాశ్వాసింపఁబడి, చాక్షుషియను విద్య నర్జునునకును, గంధర్వ హయంబులు పాండవు లేవురకు నొసఁగి, వారితోడి సఖ్యంబంగీకరించి చనియె.

అప్పాండవులు భాగీరథి నుత్తరించి, యుత్కచంబను పుణ్య తీర్థంబున కరిగి, యందు వీతసమస్తదోషుఁడై ఘోరతపం బాచరించు దేవలభ్రాతృఁడగు ధౌమ్యుని బురోహితప్రవరుగా వరియించిరి. ధౌమ్యుఁడు వారి నతిప్రీతిం బూజించి పురోహితత్వంబు బరిగ్రహించె. పాండవులును నశేష మహామహీ రాజ్యంబు వడసినంత సంతసిల్లిరి. పిదపఁ దత్కృతస్వస్త్యులయి జననీసహితంబుగ దక్షిణపాంచాలాభిముఖులైరి.

అట్లరుగువారు ముందర ద్రుపదపురంబునకుం బోయెడు బ్రాహ్మణులం గని "మీ రెందులకుం బోయెదర"ని యడిగిన వారిట్లనిరి.

"ద్రుపదరాజతనయ స్వయంవరంబు రామణీయకంబుగా రచియింపం బడుచుండెను. అందు ద్రుపదనందనం జూడంగనిన వారు, దృష్టింగనిన ఫలంబంతయుం గనినవారె. అట్టి మహోత్సవంబు చూడ ద్రుపదపురంబునకుం బోయెదము. అపార భూరిదక్షిణ యజ్ఞకరులును, అనేక శస్త్రాస్త్రవిదులును, నయిన నానాదేశాధిపతులు నింతకుం జనుదెంతురు. అనంతధనంబు బ్రాహ్మణులకు వారిత్తురంట. మీరలు వారలం జూడవచ్చెదరేని నొక్కటం బోదము, రండు" అని మాటలాడుచు వచ్చు బ్రాహ్మణులతోడం బాండునందనులు బ్రాహ్మణరూపధరులై ద్రుపద పురంబునకుం జనుచుండిరి.

ఇట్లు పోవువారొక్కట నెదుర కృష్ణద్వైపాయనుం గని వినయంబున నందఱు కృతాంజలులైరి.

అంత వారికి హృదయానందంబుగా సత్యవతీసూనుండు ఆగామిక శుభంబు లావేదించి చనియె. పాండవులును గతిపయ దినంబులకు సురక్షితంబుగా ద్రుపదు పురంబుసొచ్చిరి. అందు నాలుగు దిక్కుల విడిసియున్న నానాదేశాగతమహీనాథుల బహువిధ స్కంధావారంబులం జూచుచుం జనిచని యొక్క కుంభకార గృహంబున విడసి తమ్మెవ్వరు నెఱుంగకుండ బ్రాహ్మణవృత్తి నుండిరి.

# మూడవ ప్రకరణము

నాఁడు పౌషమాసంబునఁ బంచమి. మహా మహీపతు లందఱు నొండొరులఁ గడచుచు మిక్కిలి వేడుకతోఁ దొడి, పూసి, కట్టి, అత్యంత విభూతిమై తమతమ చిహ్నములు లెఱుక పడఁగా భూతలము గ్రక్కదలఁగా ద్రౌపదిస్వయంవర రంగ భూమికిఁ జనుచుండిరి.

స్వయంవరరంగము పురంబు పూర్వోత్తర దిశాభాగం బున రచింపంబడియె. అచటి నేలయంతయుఁ జందనోదకసంసి క్తము. అగాధోన్నతపరిఘాప్రాకార సమన్వితము. విశాలద్వార తోరణసంయుతము. అనేక ప్రాకార సాను సమన్వితము.

అందు నానాదేశాగతరాజన్యులందఱు యథాస్థానంబుల నుండిరి. పరమబ్రహ్మణ్యులైన బ్రాహ్మణులతోడం గలిసి పాండవులును విచ్చేసి యుచితాసనంబుల నాసీనులై యుండిరి.

ఆ శుభసమయంబున సితవిభూషణ దామానులేపనాం గియై సితమాల్యధారిణియై ద్రౌపదిరంగమధ్యమునకుఁ జను దెంచె.

తోడ్తో ఆశీర్వాద నినాదముతో ద్రుపద పురోహితుం డును కృతపరిస్తరణుఁడై వివాహోపవస్తుచయము గాచి యుండె. జనుల యులివును, వాదిత్రనాదంబును బోరనమ్రోయు చుండె

ఆ సమయంబున ఆ పంకులధ్వని నంతను వారించి మూఁగిన రాజలోకంబు నెల్లను జూచి, యగ్నిసమీపంబున

గంధపుష్పధూపదీపార్చితంబైన విల్లును, నమ్ములును, వైహాయ
సంబైన లక్ష్యంబును వారలకుం జూపి ధృష్టద్యుమ్నుం
డిట్లనియె.

"ఈవింటిని మోపెట్టి యయిదు బాణముల నీమత్స్య
యంత్రంబు నేసినవాఁ డీబాలకుఁ దగిన పతి. ఘనకార్ముక
కౌశలోన్నతియు, లావును గలవారలకు లలితయశంబును,
గల్యాణంబును బడయ నిదియ యవసరంబు"

ఇట్లు ధృష్టద్యుమ్నుండు రాజపుత్రులకు నెల్ల నెఱుంగ
జెప్పి, ద్రుపదరాజపుత్రింజూచి, అఖిలమహీతలంబునం గలరాజ
నందనులెల్ల నీ స్వయంవరంబునకు వచ్చినారు. వీరింజూడుమనీ,
దుర్యోధన, దుశ్శాసన ప్రముఖులైన ధృతరాష్ట్రనందనుల
నూర్వురను, దత్సమీపంబుననున్న కర్ణాశ్వత్థామ సోమదత్త
భూరిశ్రవ శ్రుతసేనాదులను, పుత్రభాతృసమేతులైయున్న శల్య
విరాట జరాసంధ గాంధారపతులను, అక్రూర సాత్యకి సాంబ
సంకర్షణ ప్రద్యుమ్న కృష్ణ కృతవర్మా నిరుద్ధ యుయుధాన
బలదేవులు మొదలైన యదువృష్ణి భోజాంధకవరులును, మిగి
లిన నానాదేశాధీశులను, వేదధ్వని నొప్పుచున్న బ్రాహ్మణ
సమూహంబును జూపి "ఇందు లక్ష్యమెవండు వేయంగలండో
వాని వరింపు" మని చెప్పె.

స్వయంవర దర్శన కుతూహలంబునం జేసి వచ్చిన దివిజ
ఖచర గరుడ గంధర్వ కిన్నరుల విమానంబు లంబరతలంబున
వెలసె. రసవత్తరగీతరవ మెల్లదెసల నెసఁగె. మహాజలధి
ధ్వానంబు ననుకరించుచు ఘోరన వివిధ తూర్యారవంబులు

మ్రోగుచుండ దివ్యానులేపనములయు, దివ్యమాల్యములయు సౌరభంబువాల్చి రంగమధ్య జనములకుం గడుంబ్రియముగా మందమారుతంబు వీచుచుండ.

భస్మమధ్యమున విస్ఫులింగంబులువోలె ద్విజవరులలోఁ బాండునందనుల నేవురంజూచి, కృష్ణుండు వారి నెఱింగె; తప్పక పార్థుం డీమెనుగ్రహించునని పరమానందంబు పొందుచుండ.

అంత నారాజనందనులు తమ్మును దమసామర్థ్యంబు నెఱుంగజాలక, యర్థిత్వంబున నవ్విల్లు మోపెట్టఁ బోయి, వడివడి నొడుగఱచి వలకేలు గొనయమున బెనచి, నీల్గి, విల్లు వాపనేరక యుడిగిరి.

అందుఁ గొందఱు "ఇది మాయాధనువు, మోపెట్టఁగఁ గొలఁదియే!" యని డాయకయే యుండిరి. నిర్మానులగు మఱి కొందఱు, "ఇది యొల్లును సమకూరదు. బ్రహ్మనులకైన నీవిల్లు మోపెట్టి అంతరిక్షలక్ష్యంబు భేదింప నలవికాదు" అని విచారించుచు నిజధామమార్గములు చూచుచు నేగిరి.

యదువృష్టిభోజాంధకవీరులు కృష్ణానుమతంబున సజ్యకర్మంబునం దనాదరబుద్ధులయి మిన్నకుండిరి.

శిశుపాల జరాసంధ శల్య కర్ణులు తమలావు మెఱసి క్రమంబున నలువురు మాష యవ ముద్గ తిలమాత్రంబులు దక్క గొనయంబెక్కించియు, మోపెట్ట నశక్యంబైన, నుక్కుసెడి స్రుక్కిరి.

ఆసమయంబున వారలఁజూచి. యగ్రజానుమతంబున విప్రసభ వెలువడి, విజయుండు తనలావు మెఱపి ధనుస్సన్నిధా-

శంబునకరిగె. ఆతని యుత్సాహంబున కచ్చెరువడి కొందఱు బ్రాహ్మణులు దమలో నిట్లనుకొనిరి. "ఈ మూఁగిన మనుజేంద్ర నందనులు అహీనబలులు; బాహువీర్యమ్ములవారు. అట్టివారు శరాసనకర్మమునం దొప్పరఁట! విప్రవంశమ్మున వారినందఱ నవ్వుపఱుప అయుక్త దర్పమ్మున నీతండొకఁడు బయలుదేరు చున్నాఁడు."

మఱికొందఱు ధాత్రీసురులిట్లనుకొనుచుండిరి, "ఇతఁడు సద్విమలాచారుఁడు. విష్ణుభక్తిపరుఁడు. అత్యంత తేజస్వి. దీర్ఘ బాహుపరిఘుండు. అమితోత్సాహుఁడు. ఈ రాజనందనులకంటెఁ గార్ముకవిద్యం దనరినవాఁడు. కావుటం జేసియే దీనికి మొనసె. అన్యుఁడిట్లు మొనయంగలఁడె. విప్రప్రసాదంబున నెల్లవిప్రులకు సంతసంబుగాఁ గార్యసంసిద్ధి నుత్తముఁడై పొందెడుగాక."

ఇట్లు బ్రాహ్మణులందఱు పరస్పర వితర్కపరాయణులై యుండిరి; రాజలోకంబు చకితమై యుండె. జనసమూహంబు చిత్రాశ్చర్యపడుచుండె; అయ్యర్జునుండు వింటిసమీపంబునకుఁ జనుదెంచె. గురువులం దలంచి, నమస్కారంబు చేసె. ధనువునకుఁ బ్రదక్షిణంబు చేసి, మ్రొక్కి. పుచ్చుకొని, పూర్వ పరిచితంబైన విల్లు మోపెట్టినట్లశ్రమంబున మోపెట్టె. ఏనమ్ముల నమ్మత్స్యయంత్రంబు నా క్షణంబ యురలం దెగనేసె.

బ్రాహ్మణ క్షత్రియ ప్రముఖులైన జనులెల్ల విస్మితులైరి. "పర్ణఫలపవనాంబుభోజనవ్రతములం జేసి దుర్బల తనులయ్యును బ్రాహ్మణులు తపోవిశేషముచే మహాబలయుతులు. అట్టివారలకు నెందునసాధ్యమెద్ది? నిమిషాంతరమున నశ్రమ

మున మర్త్యులకు నిట్లేయ నటుకూడునె? ఇతఁడు బ్రాహ్మణ రూపముననున్న సురేశ్వరుఁడో! హరుఁడో! భానుఁడో!” అని పొగడెడు జనుల నిరంతర రవంబును, నంబరతలంబుననుండి పొగడు దివ్యుల యనవరతరవంబు నొక్కటై కడునొప్పెను.

సురదుందుభిస్వనములు చెలఁగెను. పుష్పవృష్టికురియ సాగె. బ్రాహ్మణులెల్లం బయిపుట్టంబులు వీచి వీచి యార్చిరి.

అయ్యవసరంబున ధర్మనందనుండును నకుల సహదేవానుగమ్యమానుండై నిజనివాసంబునకుం జనియె ధృష్టద్యుమ్నుడు మహాసేనతో నర్జునునకు సహాయుండై నిలిచె.

అపుడు ద్రుపదరాజాత్మజ చనుదెంచి, ధనంజయుని దనచేతిసితపుష్ప దామకంబునఁ బూజించె.

# నాల్గవ ప్రకరణము

అమ్మహోత్సవంబు చూడంజూడ రాజులకుఁ గన్నెఱ్ఱ యాయెను. కౌరవేంద్రుఁ డాదిగాఁ గల భూపతులందఱు కడు నలిగి "చుట్టముగాలె మహీశుల నందఱి నెందులకు రాఁబనిచె? ఇందఱు మహారథులుండ, గన్యను విప్రున కేలనిచ్చె? పాంచాల భూపతి శఠుఁడు, ఈతని వాజిలో ఓడింతము. ఏమిదోషంబు చేసియు బ్రాహ్మణుండు వధ్యుండు గాఁడు. కావున నివ్విప్రుతోడి దేమి! అదియుంగాక తనవిద్య పేర్మిచే నీ విప్రుఁడు నృపనందనఁ బడసె. ఇది తప్పుగాదు" అనుచు ద్రుపదుపై నేఁగుదెంచిరి.

ద్రుపదుండును భీతుండై బ్రాహ్మణుల మఱువుసొచ్చె. ఇట్లు శరణాగతుండైన ద్రుపదు "నోడకుండు" మని బ్రాహ్మణులు తమ తమ దండాజినంబులెత్తి ప్రతిబలంబులపై వీచుచున్న వారలం జూచి నగుచు నర్జునుం డిట్లనియె.

"మదీయామోఘాస్త్రంబుల ఇప్పుడీ రిపునృపుల దర్పంబు డిగించెద. మీరలు చూచుచుండుఁడు."

అని తానును భీమసేనుండును గ్రమ్మఱి రిపుబలంబుపై నమితశరంబులేసె. భీముండు నొక్క వృక్షంబు పెఱికికొని దండహస్తుండయిన దండధరుండునుం బోలె నర్జునునకు సహాయుండై నిలిచె. అయ్యిరువుర మహాసంరంభంబు చూచి విస్మితుండై కృష్ణుండు బలదేవున కిట్లనియె.

"కాలాభమైన వింటిం దాల్చి విరోధుల నెగచుచున్న వాఁడు దేవేంద్రనందనుండు. అతని కెలన మహావృక్ష హస్తుఁడై యున్న వీరుండు భీముండు. నకుఁడు యత్రంబునేసిన యప్పుడు పోయిన యా గౌరవర్ణుండు ధర్మతనూజుండు. అతని తోడనరిగినయిరువురు కవలవారు. ఇదియెట్టిపుణ్యదిన మొ! లక్క యింట నగ్నిదాహంబున వీరెట్లు బ్రతికిరో కో-!" అనవిని హాలా యుధుండు సంతసిల్లుచుండె.

ఆసమయంబునఁ గర్ణుండు నరుఁదాఁకె. శల్యుండు భీముం దాఁకె. కర్ణ విజయులు నొండొరులఁ జాలఁ ౘదాఁకి, చాపంబు లాకర్ణాంతంబులగుచుండఁగా డిగిచిరి. మహోగ్ర క్రోధమూర్తులయి బాణతతిఁ బ్రయోగించిరి. ధరిత్రియెల్లనవిసె. దిక్చక్రమువడికె. అర్జును బాణంబుల సహింపనేరక, బ్రాహ్మణ తేజంబు అజే యంబని, విజయుతోడ యుద్ధంబుసేయనోల్లక కర్ణుండరిగె. శల్య భీమసేనులు పెనంగి మల్లయుద్ధంబుసేయ నెడ భీముండు భీమ బలంబునం బట్టికొని శల్యుం ద్రెళ్లవైచె.'

అవ్వారి మహాపరాక్రమంబుచూచి దుర్యోధనాదు లయిన రాజపుత్రులెల్ల విస్మితులై "వీరెవ్వరో? ఎందుండి వచ్చిరో? తెలియఁగవలయు" నని యనుకొనుచుండిరి.

వారలంజూచి కృష్ణుండిట్లనియె. "పరమదుష్కర భాసుర కార్యముచేసి, ఈ స్వయంవరమున, నీధరణీసురావ్వయోత్త ముఁడు ధర్మవిధిగాఁ గృష్ణను ధర్మపత్నిగాఁ బడసె. అనవద్య పరాక్రముఁడైన వీని నాక్రమింప నెవ్వరికిని జన్నె ! వలన దుదుగుఁడు.

ఇట్లు కృష్ణునిచే నివారితులై రాజపుత్రులు తమ తమ దేశములకుం జనిరి. భీమార్జునులు బ్రాహ్మణ పరివృతులయి ద్రుపదరాజపుత్రిం దోడ్కొని చనిరి.

ఇంటఁ గుంతీదేవియు "పుత్రులు ఉత్సవదర్శనోత్సుకులై పోయిరి. కడుఁ బెద్దప్రొద్దయినది. ఏల మసలిరో? విసుగక వైరంబు భావించి పాపస్వభావులు కౌరవులు క్రంమన నెఱిఁగి వారిం జంపిరో? అందులకు నేవురు నొక్కట నేలయరిగిరి? వేదవ్యాసువచనంబు సూనృతంబు గాకుండునా? వేల్పులార! భూసురేశ్వరులార! మీ శరణంబకాని మఱియొండుగతి నాకు లేదు. నాకు శరణమగుఁడు. కొడుకులఁ బ్రీతితో రక్షింపుఁడు" అని వనరుచుండ.

అట్టి యవసరంబునఁ దల్లియొద్దకు ధర్మరాజును గవలవారును మున్న వచ్చిరి. అనంతరము భీమార్జునులు ద్రౌపదీసహితులై వచ్చి మే మొక్క భిక్షఁ దెచ్చితిమని తల్లికి నివేదించిరి. ఆమెయు నెఱుంగక యెప్పటియట్లకాతలఁచి 'దాని మీ రేవురు నుపయోగింపుఁడ'ని కొడుకుల నియమించి, భువనత్రయ రాజ్యలక్ష్మియుంబోలె నున్న యక్కన్యకం జూచి లజ్జించి యధర్మభీతయై ధర్మతనయున కిట్లనియె.

"ఈలలితాంగిని దోడ్కొని నీతమ్ములిరువురు నేతెంచి, "ఈభిక్షఁగొను" మని నాకునివేదింప నేవురు నుపయోగింపుఁడంటి. నాయుక్తి యెప్పుడనృతంబుగాదు. మీరును మద్వచనాతిక్రమంబుసేయరు. ఇదిలోకమున లేనివింత. ఏమిసేయఁగవచ్చు" అనుచుఁ జింతాకులాత్మ అయ్యె. తల్లి నూరార్చుచు నర్జునుం

జూచి ధర్మజుఁడిట్లనియె. "పార్థా! ఇదినీచేతఁ బడయంబడియె అగ్నిసన్నిధి పాణిగ్రహణంబు నీవ చేయుము."

అనినఁ బార్థుండిట్లనియె. "పెద్దవాఁడుండఁ జిన్నవాఁడు వివాహంబగుట ధర్మవిరుద్ధంబు. కావున దీని నీవగ్రమహిషిగాఁ బరిగ్రహింపుము. మా నలువుర యభిమతంబిట్టిది."

అనుచున్న యవసరంబున విధిప్రేరణంబునం జేసి పాండు నృపాలతనూజ పంచకంబును ఆ లలితాంగియందు హృదయంబులు దృష్టులు నిల్పిరి. ఏవురకుఁ బత్నిగా సృజించియున్న బ్రహ్మచెయ్వి పరమార్థముగాక రిత్తపోవునా!

అందఱ యభిప్రాయంబును గ్రహించి వేదవ్యాస వచనంబులు దలంచి ధర్మతనయుండు తమ్ములకిట్లనియె.

"మనకేవురకు నిది పత్నిగాఁదగును. కావున మనమందఱము నీతరుణిఁ బరిగ్రహింతము. ఇది గురువచనము. మఱియొక లాగగుట దుర్ఘటము. కావున మనకు పాపభయంబు వలవదు.

అని పలుకునపుడు రామకృష్ణులు ధర్మజునొద్దకు వచ్చి కని, తమ్మెఱింగించి యుధిష్ఠిరునకుఁ గుంతిదేవికి మ్రొక్కి, భీమార్జున నకుల సహదేవులం గౌఁగిలించుకొని, పరమసమ్మద రసపూరితులై యుండిరి. వారికుశలమడిగి ధర్మజుఁ డిట్లనియె. "కౌరవులకు దవ్వై విప్రవేషధారులమై యుంటిమి మమ్మెవ్వరు నెఱుంగఁ జాలకుండిరి. మీరెట్లెఱింగితిరి."

అనిన నగుచు వాసుదేవుఁడు "అంబుజ మిత్రుండు అంబుదసమూహాంతరితుండైనను జగజ్జనంబులకుఁ దఱియ తేజంబు కప్పనగునా! మీ మహాతేజము భూజనప్రసిద్ధంబు.

దాని మాటువఱువ నెవ్వరు నేర్తురు. సకలరాజసమక్షంబున నట్టి యతిమానుషంబైన యద్భుతకర్మంబు పార్థునకుంగాక అన్యులకుఁ జేయనగునే! మీపరాక్రమంబే మిమ్మొటింగించు. ధర్మ విహితులగు ధృతరాష్ట్ర దుర్యోధనులు సేసిన లాక్షాగృహ దాహంబు వలన విముక్తులైతిరి. ఇంక మీకులగ్గగు."

అని చెప్పి బలదేవసహితుండై వాసుదేవుం డరిగె.

# ఐదవ ప్రకరణము

ఇట ద్రుపదుండు తన కూతునకు వరుండైన వాం డెవండో, ఏ వంశంబువాండో, వాని చరితం బెట్టిదో, ఎఱింగి రమ్మని ధృష్టద్యుమ్నుని బనిచె. అతండును భీమార్జునుల వెరుం బనవచ్చి, తన్నెవ్వారెఱుంగకుండ నక్కుంభకార గృహంబున నుండి యంతయు నెఱింగిపోయి ద్రుపదునకిట్లనియె.

"అయ్యారువురు వట్లు కృష్ణం గొనిపోయి యొక్క ముదుసలి పానికి మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించిరి. మఱి యొకగౌరవర్ణుండు వంపంగా నలువురు భూసురులగృహంబుల కరిగి భైక్షము దెచ్చిరి. అంత కూడును నయ్యవ్వకునొప్పించిరి. ఆపెయు ద్రౌపదినిబిలిచి "బలివిధానంబులకును ద్విజాతిథులకును, అన్నకాంక్షులకును నగ్రమందు నునిచి శేషంబు రెండు పాళ్లుసేయుము. అందొకపాలు వెడదయూరంబును నన్నత కడుపును గల యాతనికిం బెట్టుము. రెండవపాలన్నము నలువురకుం బెట్టుము. తద్భుక్తశేషంబు నీవును నేను నుపయోగింతము" అని పంచె.

కృష్ణయు నయ్యవ్వపంచిన రూపున నందఱకుం గుడువం బెట్టి తానును భుజించి దర్భలు విదిర్చి అందఱకు వేఱువేఱ శయనమ్ముల నిమ్ముగా రచియించె. వానిపై వారల కృష్ణాజినంబులు పఱచె. అందఱు సుఖశయనులై యున్న వారిపాదంబులకు నుపధానభూతయై శయనించె.

కఱకుదర్భలు పఱుపులుగా, భిక్షాన్నమశనముగానున్నను గృష్ణ వారి పతిముదమున నాదరించె. ఆదిగర్భేశ్వరి యయ్యా

సేవగింపవలెన్. 'కడవనములఁ గోలలఁ గప్పెడవులు వారి ధనము' వారెక్కడిదేశికులు!' అనిపఁగవలె వారినత్యాదరముతో గొల్చుచున్నయది.

అయోధ్యపుర వాయూకథలఁ జెప్పుచు రథసింధురాశ్వవిషయంబులును, సమవిషమవ్యూహ నిర్భేదనోపాయవిధులును, ఆయుధ విద్యా రహస్య ప్రయుక్తులును బలికికొనుచుండిరి. పలికినబానసుబట్టి చూడ సత్యోత్తమక్షత్రియులు గానోపుదురు. చరితనుబట్టి చూడ విప్రజాతివారలగుదురు. వారీరెండుజాతుల వారు గాని మఱెవ్వరుగారు."

అనిచెప్ప ద్రుపదుండానందించి వెండియువారలనిమ్ముగా నెఱుంగవేడి, తనపురోహితునింబంచె. అతండును బ్రాహ్మణ సమూహంబుతోడవచ్చి, పాండవులంగని, ధర్మరాజునియోగంబున భీముచేఁ బూజితుండై యిట్లనియె,

"మిమ్ములను మీ కులగోత్రనామములను బ్రియంబున నెఱుంగంగోరి ద్రుపదుఁడు నన్నుఁబంచె. ఆతనికిఁ బ్రియంబుగా మీవృత్తాంతమంతయు నాకెఱింగింపవేడెద. మఱియు మత్స్యయంత్రమేసిన సువిక్రము నాతఁడు చూడఁ గోరుచున్నాడు.

అనినవిని నగుచు ధర్మతనయుండిట్లనియె. "ఆవిలు మోపెట్టి యమ్మత్స్యయంత్రలక్ష్యంబు భేదించినవానికి దనకూతు నిత్తునని మీరాజు నియమముసేసెగదా! అతఁడు నియమించిన చొప్పుననే యయ్యంత్రమేసి యీతఁడిక్కన్య, బడసెను. ఇంత మీవిభుఁడు మమ్మెఱుంగనేల! ఎఱింగి యేమిచేయువాఁడు

అక్కార్ముకము మోపెట్టి, తివియగా బలహీనునకు నలవి యగునా! మీరాజు మనోరథంబు సఫలంబయ్యె. వగవనేల!”

ధర్మరాజు పలుకులువిని పురోహితుండు వారలవీడ్కొని ద్రుపదరాజుపాలికింజని తద్వృత్తాంతంబంతయు నెఱింగించె. ద్రుపదుండు ధృష్టద్యుమ్నుంజూచి చాతుర్వర్ణ్యోచితంబులగు రథంబులు గొనిపోయి వారలందోడ్కొని రమ్మనిపంచె.

అతండును నాక్షణంబ పాండవులపాలికివచ్చి ఈరథంబు లెక్కి మారాజునొద్దకు రండనియె. పాండవులు రాజయోగ్యంబులును రత్నాంచితంబులును నగురథంబు లెక్కి, కుంతీదేవిని ద్రౌపదిని నొక్కరథం బెక్కించుకొని, ద్రుపదరాజ మందిరంబున కరుదెంచిరి.

ద్రుపదుండు వారలకనేకవస్తువాహన నివహంబు లతి ప్రీతిం బుత్తెంచె. వారును బరార్థ్యంబులైన యిండువస్తువులం గైకొనక సాంగ్రామికంబులైన అసికార్ముక బాణ తూణీరాదులు గైకొనిరి. క్షత్రియోచిత మహాసనంబుల నాసీనులైరి.

వారల రాజపుత్రులంగా నెఱింగి సంశయాపనోదన పరుండై ధర్మతనయునకు ద్రుపదుం డిట్లనియె.

“అయ్యా మీరు క్షత్రియులో బ్రాహ్మణులో మాయావులయి క్రుమ్మరుచున్న మంత్రసిద్ధులో కాక కన్యాపరిగ్రహణార్థంబు దివంబుననుండి వచ్చిన దివ్యులో యెఱుంగము. మాకు సందేహంబయి యున్నది. మీ కులమా వెఱింగి కాని యిక్కన్యవివాహంబు సేయనేరము”

అన ధర్మజుండు రాజా మేము క్షత్రియులము. పాండు కుమారులము. నేను ధర్మజుఁడను. వీరు భీమార్జున నకుల సహదేవులు. ఈమె కుంతీమహాదేవి.

అని యెఱింగించిన ద్రుపదుం డతిహర్షరసావేశపరుండయి పెద్దయుం బ్రొద్దునకు దెలిసి యానందబాష్ప భరితుండయ్యె. సపుత్రకుండైన ధృతరాష్ట్రు నిందించె. సామప్రియభాషణంబులను అభీష్టసత్కారంబులను బాండుపుత్రులఁ బూజించె.

ఒక్కనాఁడు పుత్రమిత్రపరివృతుండై ద్రుపదుండు సుఖాసీనులైయున్న పాండవుల కిట్లనియె. విజయుండు మత్పుత్రికి వరుండయ్యె. నాపుణ్యం బెట్టిది? స్వయంవరలబ్ధయైన యిక్కన్యకను ధనంజయుండు ధర్మవిధిం బాణిగ్రహణంబు సేయుగాక."

అనిని ధర్మజుండు, "అదియెట్లు? ఏను వివాహంబైన పదంపడి భీమసేనుండు వివాహంబైన మఱి యర్జునుండు వివాహంబగుఁ గాక. ముందర నర్జునునకు దీనిం బాణిగ్రహణంబు సేయ నెట్లగు?" అనఁగా ద్రుపదుండు "అట్లైనచో నిక్కన్యను నీవ వివాహమగుము. ధర్మమార్గ మెవ్వరికిని దప్ప రాదుగదా!"

అనిన విని ధర్మజుండు, "ఇకన్యను మేమేవురము వివాహంబయ్యెదము. ఇది మా మాతృనియోగంబు. అది మాకు నలంఘనీయంబు" అనఁగా విని విస్మితుండై ద్రుపదుండు,

"ఒక్కపురుషునకుఁ బెక్కండ్రు భార్యలగుట యొందునుం గలదు. పెక్కండ్రకు నాలొక్కతెయగుట ఏయుగములను నే కథలను వినియెఱుంగము. నీవు లౌకిక వైదిక ధర్మస్వరూపవేదివి. నీపలుకులు ధర్మవిరుద్ధంబులని పలుకనోడుదుము. అయి

వను నిదిలోకంబునందు నశ్రుతపూర్వంబు. ఇంకనీవును నేనును గుంతీదేవియును ధృష్టద్యుమ్నుఁడును విచారించి, యెల్లి నిశ్చయింతము.”

అనిపలికి, యీ కార్యసిద్ధి యెట్లగునా యని తలంచుచు సందేహము పొందుచుండ.

ఇది యిట్లుండ నిజతేజముచే దిశలెల్ల వెలుంగుచుండగా కృష్ణద్వైపాయనుండటకు జనుదెంచె. వచ్చిన యమ్మునికిఁ గుంతీదేవియుఁ బాండవపాంచాలు రతిభక్తి మ్రొక్కి యమ్మహామునిని గాంచనమణిమయాసనంబున నునిచి, అర్ఘ్యపాద్యాది విధులం బూజించిరి.

అంత ద్రుపదుండు ముకుళిత కరకమలుండై యమ్మునీంద్రున కిట్లనియె. “ధర్మాత్ముఁడగు నీధర్మరాజు “మేమేవురము నొక్కన్య వివాహమయ్యెద మనిపలుకుచున్నాఁడు. మీకుఁ దెలియని లోకాచారము లేదుగదా! తొల్లిమహాత్ము లెవరేని నిట్లుచేసినవారు గలరే! ధర్మసంకరము కాకుండ ఈవిషయమును సువిచారము చేయవేడద”.

ద్రుపదునకు వ్యాసభగవానుల సమక్షంబున ధర్మతనయుం డిట్లనియె.

“ఎప్పుడును అధర్మమునందు నాకుఁ జిత్తముదగులదు. మాకు నేవురకు కృష్ణ నీఁదగును. ఇది యవశ్యము ధర్మువు. తొల్లి గౌతమియైన జటిలయను ఋషికూతురు తపఃప్రభావంబున నేడ్వుర ఋషులకు నొక్కతయ భార్యయయ్యె. దాక్షాయణియను ముని కన్యక ప్రచేతసు లనంబరఁగిన పదుండ్రకు

నొక్కతె భార్యయయ్యె. ఇంతయేల! తల్లి గురులలోఁ బరమ గురువు. అట్టి తల్లివచనము నన్యథాకరింప నలవియగునే!

ద్రుపదుండది విని "త్రికాలప్రవర్తన జ్ఞాననిధి శ్రీకృష్ణ ద్వైపాయనుండు విచారించి యొద్దియానతిచ్చు నదియ మనకుఁ గర్తవ్యం"బనియె.

అంత నమ్మునివరుండు ద్రుపదున కిట్లనియె "ధర్మతత్త్వ జ్ఞుండు ధర్మతనూజుండుధర్మమార్గంబు తప్పఁడు. దేవతామూర్తి యీకుంతీమహాదేవి యనృతంబుపలుకదు. ఇయ్యేవురకుఁగూతు నిచ్చి వివాహంబు గావింపుము. వీరికల తెఱంగెఱుంగ నిష్టమగు నేని వినుము" అని ద్రుపదుతో నేకతమ యిట్లనియె.

"తొల్లి యింద్రసేన యను పరమపతివ్రత మౌద్గల్యాం డను మునికి భార్యయై యుండె. కర్మవశంబున నమ్ముని కుష్ఠ వ్యాధి బాధితశరీరుండు వయోవృద్ధుండు వలీపలితతనుండు దుర్గంధవదనుండునతికోపనుండు నయ్యె. అయినను వానిఁబరమ భక్తి నారాధించుచుఁ దదుచ్ఛిష్టంబు గుడుచుచు నింద్రసేన కాలంబు గడుపుచుండె.

దానిదయిన పతిభక్తికిమెచ్చి మౌద్గల్యుండు ప్రస న్నుండై "నీకొద్దియిష్టంబు వేడుము ఇచ్చెదనన "మునీంద్రా నాకుం గామేచ్ఛ పెద్దయుంగలదు. నీవు తపశ్శక్తిం గామ రూపధరుండవై మనోహరంబగు రూపంబుదాల్చి పంచధా విభక్తుండవై నాకుప్రియంబుసేయుము"

అనియింద్రసేనపలుకఁగానమ్ముని దానికిష్టంబైనవిధంబున ప్రవర్తించి దానివిడిచి ఘోరతపంబుచేసిబ్రహ్మత్వమయుండయె

ఇంద్రసేనయు దృప్తింబొందక కొంతకాలంబునకు శరీరంబు విడిచి కాశిరాజను రాజర్షికింబుట్టి, కన్యాత్వంబునఁ బెద్దకాలం బుండి, పతింగోరి పశుపతినుద్దేశించియుగ్రతపంబు సేయుచుండె.

అట్లామె యత్యుగ్రతపంబుచేసినఁ బ్రసన్నుండై యీశ్వరుండు వరంబు వేడుమనిన నక్కన్యక 'నాకుఁబతిదానంబు ప్రసాదింపు' మని యర్థిత్వంబున నయిదుమారులు వేడె. ఈశ్వరుండు కరుణించి, నీకు దేహాంతరమునఁ బతులేవురగుదు రనియె.

అంతనామె 'దేవా! యిట్టిలోకవిరుద్ధవరము పడయజాల నని చెప్ప రుద్రుండిట్లనియె. "నావచనప్రభావంబున నీకేవురు పతులైనను ధర్మభంగంబు కలుంగకుండు. ఓడకు" మనియె.

అనఁగా నింద్రసేన "అట్లేని నయ్యేవురు పతులందును నాకుఁ గామాగత్వంబును, పతిశుశ్రూషయు, కామేచ్ఛయు, సౌభాగ్యంబును బ్రసాదింపవలయు" ననినదాని కోరిన వరంబులెల్ల నిచ్చి చనియె. మఱియు నామెతపస్సు చేయుసమయంబున ధర్మవాయువాసవాశ్వినులు ప్రీతులై వచ్చి, ఆత్మదేహాంశజులకు దానిఁ బత్నిగాఁ గోరిరి.

ఇది వీరిపూర్వజన్మ వృత్తాంతంబు. నమ్మవేని వీరలఁ పూర్వదేహంబులఁ జూడు" మని కృష్ణద్వైపాయనుండు ద్రుపదునకు దివ్యదృష్టియిచ్చి చూపిన, సకలలావణ్యమూర్తియై వారలకేవురకుఁ బత్నిగాఁ దపంబుసేసిన యక్కన్యక పూర్వదేహంబు చూచి, విస్మితుండై, హర్షించి యున్న ద్రుపదునకు వెండియు గృష్ణద్వైపాయనుండు,

"తొల్లి నితంతుఁడను రాజర్షి కొడుకులు స్వయంవరంబున సాళీనరపతి కన్యక నళిత యనుదానిఁబడసి వివాహమైరి. తొల్లింటి మహాత్ములయందును నిట్టిచరితంబులు గలవు. పాండవులకేవురకుఁ గ్రమంబున ద్రౌపదిం బాణిగ్రహణంబుసేయుము" అని ద్రుపదు నెట్టకేలకు నొడంబఱిచి చనియె.

అంత ద్రుపదరాజ మందిరమ్మున ధౌమ్యుడు వివాహంబు సేయునపుడు కన్యాత్వంబు దూషితంబుగాకుండ నీశ్వర వరంబునఁ గౌమారంబుపడయు నక్కన్యకను గ్రమంబున ధర్మజ భీమార్జున నకుల సహదేవులకుఁ బాణిగ్రహణంబు చేయించె. ద్రుపదుండేవురకు వేయువేయు ననర్ఘ్య రత్నఖచితాభరణశయ్యాసన రథ కాంభోజ హయ దాస దాసీ జనాదుల నగ్ని సాక్షికంబుగానిచ్చె. యాజ్ఞసేనియుఁ దుల్యమగు పరిచర్యచేఁ బతులకు నతిముద మొనరించుచుఁ గుంతీదేవి మనస్సున కెక్కియుండె.

# ఆటవపర్వకరణము

అటవాసుదేవుండు ద్రౌపదిని పాండవులేవురువివాహం బగుట విని, సంతసిల్లి, వారికి నానాదేశ చిత్రవస్తువు లాదిగాఁ బెక్కులు కానుకలు గొనివచ్చియిచ్చి ద్రుపదపురంబుననుండె.

ఇట్లు పాండవులు ద్రుపదపురంబు ; ; ; ; ; ; ; ; ; తులై యొక్క వత్సరంబుండిరి.

ధృతరాష్ట్రుండు భీష్మద్రోణ విదురాది ప్రేరితుండై పాండవులం బిలిపించి కృష్ణుండు సాక్షిగా వారి కర్ధరాజ్యమిచ్చి ఖాండవప్రస్థమ్ము నివాసమ్ముచేసె.

పాండవులు ధృతరాష్ట్రు శాసనంబుననుభీష్మాదుల యను మతంబునను వాసుదేవ సహితులై ఖాండవప్రసమ్మున కరిగిరి. అందు విశ్వకర్మ నిర్మించిన సుప్రశస్తమైన యింద్రప్రస్థపురం బున నింద్రవైభవముతో ధర్మజుఁడు పరాక్రమ ప్రణయ వశీకృతాఖిల రాజన్యుండై సుఖంబుండె.

అంతనొకనాఁడు నారదుఁడు పాండవేయుల పాలికిఁ జనుదెంచె. అమ్మునిని పాండవులు పాంచాలీసహితులై యతి భక్తి పూజించిరి. మునియు వారి నాశీర్వచనంబుల నభినం దించి, ద్రౌపదిని పోవంబనిచి, యేవురకు నేకాంతంబున నిట్లనియె.

"మీరనోన్యన్య నిత్యసౌహార్ద్రమతులు. సకల ధర్మజ్ఞులు. మీ కిపుడు ద్రుపదనందన యొక్కతె ధర్మపత్నియై యున్నది. ఇయ్యది లోకాగమఁబులఁదు విరుద్ధము. ఈమె కారణంబు

మీకు విప్రీతి పుట్టకుండ నుండవలయు. తొల్లి సుందోప సుందులనువారలొక సుందరికొఱకు విగ్రహించి తమలోఁ బోరి హతులైరి.

కావున మీరేదేని నొక సమయము నేర్పఱచుకొనుట సమంజసము.”

నారదమహాముని పలుకు చేకొని, తమలో నొడంబడి, యేవురయందును బ్రీతితో ద్రౌపది యొక్కొక్క యింట నొక్కొక్క యేడు క్రమంబున నుండునట్లును, ద్రౌపది యెవ్వరి యింట నుండునో అయ్యింటి వలనఁ బెఱవారు సనకుండునట్లుగను; నెఱుఁగక చనినవారు పండ్రెడు నెలలు తీర్థసేవ చేయునట్లుగను; పాండవులు మునీంద్రునొద్ద సమయంబు చేసిరి.

ఇట్లు హితోపదేశంబుచేసి నారదుండరిగె. అది యట్లుండె.

అంత నొకప్పుడు కృష్ణుచేత ననుజ్ఞాతుండై ధర్మరాజు రాజసూయ మహాధ్వరంబు చేయ నుపక్రమించె. అమ్మహాధ్వరం బత్యంతవైభవంబున సమాప్త ప్రయోగంబయ్యె.

ఆరాజసూయయాగ సందర్శనార్థమువచ్చిన దుర్యోధనుండును, శకునియు మయసభావిభవంబు చూచువేడ్క నింద్రప్రస్థమున్నఁ గొన్ని దినంబులుండిరి. ఒక్కనాఁడు దుర్యోధనుండు దాని యపూర్వరామణీయతకు విస్మితుండై క్రుమ్మరుచు వివృతద్వారప్రదేశంబు సంవృతంబుగా వగచి చొర నేరడయ్యె. సంవృతద్వారంబు వివృతంబని చొరఁబోయి తక్కవాట స్ఫటిక శిలాఘటిత లలాటుండయ్యె; నీలాశ్మస్థగితంబైన విమల మణి

స్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగఁద్రోచుకొనియె. స్ఫటికదీప్తి జాల పరివృతంబైన జలాయశంబు స్థలంబుగా వగచి కట్టినపుట్టంబు దడియంజొచ్చి, క్రమ్మఱె. వానింజూచి పాంచాలి యుం బాండుసుతులు నగిరి.

ఈ యవమానమే దుర్యోధనుని కేవల మున్మత్తుని జేసి వైచినది. వెంటనే యతఁడు హస్తిపురికిఁబోయె. సకల సుఖోప భోగవిముఖుండయ్యె. పిదప శకుని మాయోపాయంబులం దెలి వియు నాశనుగాంచి, తండ్రి నొప్పించి, సుహృద్ద్యూతార్థ మింద్రప్రస్థపురమునుండి ధర్మజుని, సోదరులను, పాంచాలిని రావించె. పాండవకౌరవు లతి ప్రణయంబున నద్దివసంబు గడిపిరి.

మఱునాఁటి యుదయంబున ధృతరాష్ట్ర నిర్మితంబైన సభను దుర్యోధనుఁడు చూపుచుండ ధర్మరాజు చూచుచు సుఖాసీనుండై యిష్టసంభావణ క్రీడావినోదుఁడైయుండె.

ఆసమయంబున దుర్యోధనుఁడు "ప్రొద్దుపోకయున్నది సుహృద్ద్యూతం బొనరింతము. నాకై నీతో శకుని జూదమా డెడి. అతఁడొడ్డి యోడినధనరాసులన్నియు నీకునీఁగలవాఁడ" నని పలికె. విధి ప్రేరితుండై ధర్మజుండు సమ్మతించె. సుహృ ద్ద్యూతంబు ప్రవర్తిల్లె.

ధర్మజుండు బద్ధమత్సరుండై తన సర్వస్వము నొడ్డి యోడిపోవుచుండె. మహీతలంబంతయు నొడ్డి యోడిపోయె. తుదకు సహోదరుల నోడిపోయె. తన్ను ద్రౌపదిని గూడ నొడ్డి యోటుపడియె. సభాస్థలంబంతయు సంక్షుభితమగుచుండె.

దుర్యోధనుండు పాండవులం దనకు దాసులుగా నొడిచినవాఁడై గర్వంబునం బెఱిగి, తనయిల్లువరవుల్లఁగలసి తుడుచుటకుఁ గృష్ణఁబనుచు వగతో నా పుణ్యురాలి తేఁబనిచె.

విదురుండు దానిసహింపనేరకదుర్యోధనునితో నిట్లనియె.

“ద్రౌపది యవనీతల సామ్రాజ్యోత్సవమునకు యోగ్యయైన సతి. పాండవ ధర్మపత్ని. నీచే నవమానింపఁ బడుటకు అంత దిక్కులేనిదిగాదు. ఏల మూర్ఖుఁడవై యాశీవిషంబుల నలిగించెదవు? మోసముచేసి కౌరుల ధనముగొనుట ధర్మమే! ఈ జూదంబువలనఁ దప్పక ఎగ్గుపుట్టు. దీనదయ్యెడు ఫలంబు వేణుఫణంబునుం బోలె సహామూల వినాశనంబగు.”

అను విదురుని దుర్యోధనుండు తూలనాడి, ప్రాతికామిని బిలిచి, “ఈ విదురుం డెపుడు ననిష్టంబులుపల్కుచుండు. పాండవులకు వెఱచు. నీవుపోయి ద్రౌపదిం దోడ్కొని రమ్ము” అని పంచె.

# ఏడవ ప్రకరణము

పాండవమహిషియొద్దకుంజని భక్తివినతుండయి ప్రాతికామి ఈప్రకారంబుగా ననియె.

"ధర్మరాజు ధనసంపదలను, ధరణీరాజ్యమును, దమ్ములను, దనయులను, దన్నును, నిన్నును జూదంబున ధార్తరాష్ట్రునకు నోటువడియె. దుర్యోధనుని పంపున నిను దోడ్కొనిపో వచ్చితి. ఇపుడ రావలయును."

ద్రౌపది యిట్లనియె.

"ఏయుగములందుంగాని, ఎట్టిదుష్కృతవుండుగాని, భార్య నొడ్డి, యోటువడిన భర్తగలండా! ఇది కడు నపూర్వమైన విషయము. అకలంకేందుండైన ధర్మజుండిట్లు సేయునే? అన్నా! ప్రాతికామీ! యెఱుంగుదేని నాయడుగు ప్రశ్నంబునకు వివరంబుగాం బ్రత్యుత్తరంబిమ్ము. విభుండు మున్ను నన్నోటువడి, తన్నునోటువడియెనో, లేక తన్ను మున్నోటువడి, నన్నోటువడియెనో!

ఈ విషయంబు నీకు స్పష్టంబుగాం దెలియదేని, నక్కితవుని ధర్మజునడిగి వచ్చి పిమ్మట నన్నుం దోడ్కొని పొమ్ము."

ప్రాతికామి సభకువచ్చి, ద్రౌపదిప్రశ్నంబు ధర్మనందనునకుం జెప్పిన, దురోదర పరాజయ దుఃఖితచేతస్కుండగుటం జేసి యతండు ప్రత్యుత్తరంబీయడయ్యె.

అపుడు ప్రాతికామికి దుర్యోధనుం డిట్లనియె. "ఇది సందిగ్ధమైన యర్థము. ఇచటికి వచ్చి ద్రౌపది తెలిసికొనును గాక. నీవు తడయక ద్రౌపదిని దోడ్కొని రమ్మని, పొమ్ము."

ప్రాతికామియు ద్రౌపదిపాలికిం బోయి, "దేవీ! నీయడిగిన యర్థమునిర్ణయించుటకు సభ్యులు నిన్ను రాఁబంచిరి, తోడ్తో రావలయును". అని విన్నవింపఁగా పాంచాలి దుర్యోధనుని దుర్వ్యవసాయంబునకును ధర్మరాజు సమ్మతంబునకును గడునలిగె. కాని చేయునది లేక, ప్రాతికామి పిఱుఁదన యేకవస్త్రయు, నధోముఖియు, నవిరళగళితనయనజలబిందుసందోహయు నగుచు సభకు నరిగెను.

లజ్జితులై దుఃఖితాత్ములై ద్రోవదిం జూడనోపక పాండవులు తలలువాంచి యుండిరి. పాండవుల వైలక్ష్యంబుపలక్షించి, సంతోషించి, దుర్యోధనుఁడు దుశ్శాసనుం బిల్చి,యతనితో"ప్రాతికామి వృకోదరునకు వెఱచు. నీవుపోయి ద్రౌపదినిటకు దోడ్కొనిరమ్ము.'' అనిపంచిన నిర్దయాత్ముఁడును పాపనిరతుఁడును నగు దుశ్శాసనుఁడు ప్రయత్న సుముఖుండగుట యెఱింగి, ద్రౌపది కడుభయంబు నొంది, వడంకుచు, అతిరయంబున గాంధారి యొద్దకుఁ జనియె.

కౌరవాధముండగు దుశ్శాసనుఁడు ద్రోవది పిఱుఁదన పాఱి 'ఇంక నెక్కడికిఁ బోయెదవు? ఏమియుఁ బలుకఁ దగదు. దురోదరంబున శకుని నిన్నోడించె. దుర్యోధనుని యర్థమవైతివి. నీపతులు పాండవులు నిన్నును బృథ్విని దమ్మును గోల్పడిరి.

అనుచు డాయవచ్చె. ద్రౌపది కోప దుఃఖ భయంబులు ముప్పిరిగొన "నేను రజస్వలను. ఏకవస్త్రను. నన్ను ముట్టకుము. గురు బంధు జనాధిష్ఠితంబగు సభకు నెట్లు రానేర్తు" అనియె.

దుశ్శాసనుండును "నీవేక వస్త్రవైననేమి? విగత వస్త్రవైననేమి? నిన్ను నెట్లును దోడ్కొనిపోదు" అనుచు బలాత్కారంబున

ఉ॥ "అవనజాననం గురుకులాపకళదుండు గడంగిరాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్ర పవిత్రవారి ధా
రావళిఁ జేసి పావనములైన శిరోజములన్ గ్రహించి పా
పావహుఁడీడ్చి తెచ్చె సభకందఱు విస్మయమంది చూడఁగన్."

ఈప్రకారంబున దుశ్శాసనాపకృష్టయయి వికీర్ణ వేణియు, వివర్ణ వదనయు నయి, కర్ణ దుర్యోధన శకుని సైంధవాది దుష్ట భూయిష్ఠంబైన సభకువచ్చి, శోకలజ్జా పరవశయై ద్రోవది యిట్లనియె.

ఉ॥ "అనుపమ దైవయోగ పాతుఁడయ్యు నవశ్యము ధర్మసంపదం
దనరునతాని ధర్మజుఁడు ధర్మపథంబదియేలతప్పఁ ద్రో
క్కొను గురువృద్ధులార! భృశకోపనుఁడీతఁడు నన్ను నేలదు
గ్గనుఁడిటకీడ్చి తెచ్చె, నవిచారపరుండయి దుర్మదంబునన్.

చ॥ ఇదియనుచితంబుగాదనక యిక్కురుముఖ్యులు చూచుచుండ, దు
ర్మదుఁడయి వీఁడు నన్నవమానితఁజేసెడు; సర్వధర్మసం
విదులన నున్న యీభరతవీరుల వంశము నేఁడధర్మ సం
పద నతినింద్యమయ్యె నవిభామిని కృష్ణఁదలంచె భీతయై."

జగత్త్రయ జయ భుజవీర్య సనాథులైన నాథులు గలిగియు ననాథయుంబోలె ద్రౌపది భయార్తయై యార్తజన శరణ్యుండైన జనార్దనుని దలంచుచుండెను.

ఆమెంజూచి దుఃఖితుండై భీమసేనుండు పాపద్యూతంబునందు అధర్మప్రవర్తకుండగు ధర్మజుని బాహుదాహంబు సేయవలయునని రోషావేశంబునఁ బల్కెను. అర్జునుండు సముచితవాక్యంబుల నతని నూరార్చుచుండె.

ఇట్లు దుఃఖితులగుచున్న పాండవులను, దుశ్శాసనాపకృష్టయై సభాంతరంబుననున్న ద్రౌపదింజూచి, వికర్ణుండను వాఁడు సభ్యుల కిట్లనియె.

ఇపుడు ద్రౌపదీప్రశ్నము బుద్ధిమంతులు విచారము సేయవలయు. అవిచారమునఁ బ్రవర్తిల్లుట నరకహేతువగును. కురుగురువృద్ధులైన భీష్మద్రోణకృపాచార్యులును బలుకరైరి. సభాసదులెల్లరు నూరకుండిరి. ఔఁగాక!

నేనిందు ధర్మనిర్ణయంబు చేసెద. జూదంబు వేఁటయుఁ బానంబును బహుభక్షణాసక్తియు నను నాలుగు దుర్వ్యసనంబులు. అందు దగిలిన పురుషుండు ధర్మువుందప్పి వర్తిల్లు. అట్టివాని కృత్యంబులు చేకొనందగవు. వ్యసనవర్తియగు ధర్మజుండు పాండవుల కందఱకు సాధారణ ధనంబైన పాంచాలిఁ బణంబు చేసె. కావున ద్రౌపది యధర్మవిజిత. మరియు నేకవస్త్రయగు నామె నిటఁ దోడ్కొనితెచ్చుట యన్యాయంబు.

వాని పలుకుల కోడంపడక కర్ణుం డిట్లనియె.

"ఇందఱు పెద్దలుండఁగఁ జిఱుతవానికింత గఱువతనం బేల? నీవు ద్రౌపది యధర్మవిజితయని పలికితి. ధర్మజుండు తనసర్వస్వములు నొడ్డి యోటువడ్డప్పుడు ఈమె దానికి వెలిగాదు. కావున ధర్మవిజితయే. మఱియు నేకవస్త్రయు సభకుఁ

దోడ్కొనివచ్చుట యధర్మంబటివి. భార్యకు నొక్కరుండ భర్త. దైవాధిష్ఠితుఁడై యుండు. ఇది యనేక భర్తలు గలది. కావున బంధకి నాఁబడు. ఇట్టిదాని విగతవస్త్రంజేసి తెచ్చినను ధర్మవిరోధంబు లేదు."

ఈ కర్ణకృత వికర్ణప్రత్యాఖ్యానంబువిని దుర్యోధనుండు దుశ్శాసనుంబిలిచి "యీపాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లపహరింపుమనినఁ దోడ్తో దానినివిని బసిమిసైడియున్న పాండుసుతులు తమపైపుట్టములు మున్న తీసివేసిరి.

హృదయ మదరుచుండ, శరీరము కంపించుచుండ, "నేనింకేమిసేయుదు, నాకిట దిక్కెవ్వరు" అని ద్రౌపది దయానిధియగు గోవిందునే శరణుసొచ్చెను.

సద్గ్వాగ్రితుండగు దుశ్శాసనుఁడు యుక్తాయుక్తవిచక్షణ మిసుమంతయు లేక, శంకారహితస్వాంతుఁడై ద్రౌపదిపుట్టంబు నొల్చె. తోడ్తోనట్టిదియవస్త్రం బమ్మహాపతివ్రత జఘనమండలంబు పాయకయుండుచుండె. దుశ్శాసనుఁడు విసువక వస్త్రంబు లొల్చుచునేయుండెను. అట్టివియ వస్త్రంబులా పెజఘనమండలంబును బాయకయేయుండె. ఇట్లుఁడుపనీతంబులైన వస్త్రచయంబు పర్వతోపమానమయ్యె. దుశ్శాసనుండు నింక నొలువనోపక యుక్కుదక్కి లజ్జపొందియుడిగె. సభ్యులెల్ల రుదితసమ్మదులై

"సాధ్వీమతల్లీ! నీజన్మము ధన్యము, నీచరిత్రము నిష్కలంకము. నీపాతివ్రత్యమద్వితీయము. నీమాహాత్మ్యమనంతము" అని మనమ్ముల దలంచుచుండిరి.

అట్టి యవసరంబున భీమసేనుండు ముడివడు కనుబొమలతో నత్యంకాల కాలునిభంగి దంతసందష్టదారుణ ముఖుండై యెల్లసభ్యులు వినుచుండ నిట్లనియె.

మ॥ కురువృద్ధుల్ గురువృద్ధబాంధవులనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రౌపది నిట్లుచేసినఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

ఇట్లు సేయనైతినేనిం బితృపితామహుల గతికిం దప్పినవాఁడ నగుదును."

పవనతనయుని యతిమానుషంబగు నీ మహాప్రతిజ్ఞకు సభ్యులెల్లరు దిక్కులు సూడక దిక్ప్రభ్రమ ముఖరిత ముఖులగుచు సపుత్రకుండగు ధృతరాష్ట్రు నిందించు చుండిరి.

అయ్యవసరంబున నుద్గతబాష్పనయనుం డగుచు, నెల్లవారిని వారించుచు విదురుం డిట్లనియె.

"ఈ ధర్మసభయందుఁ గల సుమతులకు ద్రౌపదీ ప్రశ్నము విచారింపఁదగి యున్నది. ధర్మసందేహము తీర్పని నాడు సభ్యులగు సజ్జనులఁ బాపము బొందును.

బాలుండయ్యు నీవికర్ణుండు దేవమంత్రివలె యథావిధిగా ధర్మము తెల్పె. ఈతనిబుద్ధి చేకొనుట సమంజసము.

సభకు వచ్చి, యడుగఁబడియు, నెఱిఁగియు, ధర్మసందేహము తీర్పని సభ్యులనృత దోష ఫలమునం దర్ధము వొందుదురు. లాభలోభ పక్షపాత బుద్ధిచే నెవండు మిన్నకుండునో వాఁ డనృతదోషఫలమంతయు ననుభవించు. కాన

మీారును ద్రుపదరాజపుత్రి యడిగిన ధర్మనిర్ణయంబు దప్పక చేయునది.

అని విదురుండు పలికినను దుర్యోధను భయంబున సభ్యు లెవ్వరు పలుకక మిన్నకయుండిరి. భీష్మాది కురు వృద్ధులును, ద్రోణాదిగురువర్యులును బలుకరైరి.

ఇదియంతయుఁ జూచి ద్రౌపది దుఃఖితయై "అనాఁడా స్వయంవరమున నావిధముగా సర్వభూపతులచేఁ జూడఁబడితి. పాండవుల ధర్మపత్నినై గోవిందుచెలియనై సభామధ్యమున సర్వమహీధవ సమక్షమున నేఁడీ యధమునిచే నిట్లు పరీభూత నగుదునా!

ఎవ్వరేని నాపలుకులకుఁ బ్రతివచనము పలుకువారు లేరా! ధన్యులార! ధర్మభంగభయమునం జేసియేని మాఱు పలుకుఁడు. నేను దాసినా లేక అదాసినా! ఎఱుఁగఁజెప్పుఁడు" అని వనరుచుండ.

ఆవెంబడి శాంతనవుండు "అమ్మా నీ ప్రశ్నంబులకు సదుత్తరంబు యుధిష్ఠిరుండ చెప్పవలయు. కాని నాఁడు ధర్మ సూక్ష్మత మెవ్వరికిఁగాని గహనంబు. ఇక్కురుకుల పాంసనులు వేగం బిప్పాప ఫలం బనుభవింతురు" అని యనియె.

రాధేయుం డయ్యవసరంబున నక్కోమలిం జూచి నగుచు "సుందరీ! అయిదుగురు భర్తలకంటె నొక్క భర్త లగ్గు. జూదములో నాలి నోడిపోవనివాని నింకేని నొకని వరింపు" మని యుల్లసము లాడుచుండ, దుర్యోధనుఁడు ఆమహాసాధ్విని, విభీతహరిణాక్షిని, గలాప విభాపికేశభారను,

తన రమ్య పృథూరుతలంబునెక్కఁగా రమ్మని సన్నసేసెను. ఆ సన్నను దూరమ్ముననుండిచూచి భయసమయదండధర నిర్దయుఁడై, సభ్యులెల్లరు విస్మయసంభ్రమ సంభృతులై తన పలుకులు వినుచుండ భీమసేనుండిట్లనియె.

ఉ॥ ధారుణి రాజ్యసంపదమదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరునిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.

ఇట్లు సర్వజన భయానకంబుగా శపథించి భీమసేనుండాయుధంబులున్న వలనికి దృష్టులనలుపుచు ధర్మజు మొగంబు చూచుచుండె. ఆరౌద్రాకారంబుఁ జూచి భీష్మ ద్రోణ విదురాదులిది కోపంబునకు సమయంబుగాదని యాతనిం బ్రశాంత చిత్తుం జేసిరి.

అట్టియెడ ధృతరాష్ట్రుని యగ్నిహోత్రాయతనంబున నక్కలరచె. అగ్నులారిపోయె. కౌరవస్త్రీగతి హృదయములు శోకతప్తములయ్యె. ధార్తరాష్ట్రుల శయ్యాగారంబులయందుఁ గాక ఘూక ఘూత్కారంబులెగసె.

ఈ మహోత్పాతంబులన్నింటిం జూచి కురుగురువృద్ధులు ధృతరాష్ట్రకుమారుల కరిష్టముపుట్టెనని తమతమ మనస్సుల భావించుచుండిరి.

దీనినంతయు నెఱింగి గాంధారి విదురుందోడ్కొని ధృతరాష్ట్రుని పాలికింబోయి, పాండవుల పరాజయంబును, ద్రౌపది

పరిభవ ప్రకారబుగాఁ దన్నిమిత్తోత్పత్తియుం జెప్పి. ధృత రాష్ట్రుం డదరిపడి దుర్యోధనుం బిలచి యిట్లనియె.

"చ॥ పరమపతివ్రతిన్ సభఁదపస్వినిఁ బాండవ ధర్మపత్ని ధ
ర్మరతి నయోనిజన్, బ్రకృతిమానవభామినిగాఁ దలంచి, దె
ప్పరముఁలువల్కఁ గాఁదగునె బాల్యముదక్కవు, దుష్టభాసనం
బెరిఁగితి నీకుచిత్తమునఁ బెద్దయుఁ దుఃఖితులైరి పాండవుల్.

నీవు వారలవలన క్రోధంబువిడువుము". అని దుర్యోధను వారించి, సకలబాంధవ హితంబు సేయందలంచి ద్రౌపది రావించి శాంతవచనంబుల నిట్లనియె.

"సుందరీ! నీవ నాకోడండ్రురయం దభ్యర్చితవు. అత్యానందంబున నీకుఁ బ్రియంబు సేయనుంటి. నీకెద్దియిష్టమో వేడుకొనుము".

అనిన ధృతరాష్ట్రునకు ద్రౌపది యిట్లనియె. "నాకు వరంబు ప్రసాదించుట నీకుఁబ్రియంబగుచో మహానుభావుండు ధర్మతనయుం దాస్యంబువలనఁ బాయునట్లుచేయునది ఇదియె నాయిష్టంబు". అనిన నిచ్చితి నింక రెండవవరంబు వేడుకొనుమనిన ద్రౌపది యిట్లనియె,

"ధర్మరాజు నలువురు తమ్ములును దమవస్త్రముల తోడను, దమశస్త్రముల తోడను, దాస్యబువలనఁ బాయునట్లు చేయునది."

అనిన ధృతరాష్ట్రుండు "నీకోరిన వరంబిచ్చితి. ఇంక మూఁడవవరంబు వేఁడుమనిన" ద్రౌపది యిట్లనియె.

"వైశ్యసతి యొక్క వరంబును, క్షత్రియసతి రెండు వరంబులును, శూద్రసతి మూఁడువరంబులును, విప్రసతినూఱు వరంబులును వేఁడవచ్చును. కాన నాకు నింక వేఁడఁ జనదు."

అనిని దృతరాష్ట్రుండు ద్రౌపది గుణంబులకు ధర్మజ్ఞతకు సంతసిల్లి, యనుజ సహితుండగు ధర్మరాజును రావించి, "నీ సర్వజన సంపదలు, రాజ్యంబును గొనిపోయి . యెప్పటియట్ల యింద్రప్రస్థపురంబున సుఖంబుండుము. నీకు లగ్గయ్యెడు. అరుగుము. మఱియు నీవు ధర్మంబు లన్నింటి నెఱింగినవాఁడవు. ఎఱుక లేక నాకొడుకులు నీకగ్గు సేసిరి. దీని మఱచునది. ఏను బుద్ధిలేక జూదం బుపేక్షించితి. అల్పబుద్ధి సత్వుండనగు నన్నును మీతల్లి గాంధారినిఁ దలంచి, దుర్యోధనాదుల దుర్గుణంబులం దలంపక యెప్పటియట్లు స్నేహంబున వర్తించుచుండునది.

సర్వశాస్త్ర విదుండగు విదురుండు మంత్రిగా" నీవు రక్షకుండవుగాఁ గురుకులంబునకు లగ్గయ్యెడు'అని ధర్మరాజును బాండురాజ్యంబునకు నియోగించెను.

ఇవ్విధంబంతయు భీమసేను డెఱంగి "సతి కారణంబుగా" రాజ్యప్రాప్తి ధృతమయ్యె ననుటకంటెఁ గష్టంబు మఱియొండు గలదా! యని కోపఘూర్ణితరక్త నేత్రుఁడై, "ఉగ్రసంగరాంగణంబునఁ బరాక్రమంబున శత్రువరులఁ జంపి రాజ్యముగొందు" ననుచు సింహంబుభంగి విజృంభించుచుండె. ధర్మజుం డాతని సాంత్వవచనంబుల వారించి, తమ్ములుం దానును ద్రౌపదీ సహితంబుగా గాంచన రథారూఢుండై యింద్రప్రస్థపురంబునకుం జనియె.

దుర్యోధనుండు దుష్టచతుష్టయంబుతో ధృతరాష్ట్రు నొద్దకుఁజని, "ఇంకఁ బాండవులకు నెంత లగ్గొనరించియు హితుల మర్యాదమో? ఆశీవిషంబుల నలిగించి కంఠసమీపంబున విడుచునట్లు వారి విడిచిపుచ్చి కర్జంబు దప్పితిమి. కావున వారిని మరల రావించి, యనుద్యూత పరాజితులం జేసి, భూమి వెలువరించుట కార్యంబు" అని ధృతరాష్ట్రు నట కేనియు నొడంబడఁ జేసె.

పాండవుల మరలఁ బిలువంబంచి దుర్యోధనుఁడు "పునర్ద్యూతార్థంబు మిమ్ము పిలువంబంచితి. ఇది యపూర్వంబైన పణంబు. దీనినొడ్డి యోటువడినవారలు అజినవల్కలంబులు కట్టి, కందమూల ఫలాశనులై బ్రహ్మచర్యంబునం బండ్రెండేండ్లు వనవాసంబు సేసి, పదమూడవ యేఁ డజ్ఞాతవాసంబు చేయునది. ఆందెరుంగ బడిరేని వెండియు బండ్రెండేండ్లు వనవాసంబు, నొక్కయే డజ్ఞాతవాసంబు చేయుదము. ఇట్లోపుదేని జూదం బాడునది" అనియె.

ధర్మసూతుండు నొడ్డి దైవముచెయిది నోటువడియె. ఇట్లు పునర్ద్యూత పరాజితులైన పాండవులు తమ రాజ్యోపభోగంబులు విడిచి బ్రాహ్మణ సుహృద్బాంధవ జనోపాస్యమానులై వనంబులకుం బోవ సమకట్టిరి.

# ఎనిమిదవ ప్రకరణము

అట్లు పాండవులు పరిత్యక్తవిభవులై గజపురంబు వెలువడు సమయంబున భూకంపాద్యనేక దుర్నిమిత్తంబులు పుట్టెను. వానిప్రకారం బెఱింగి ధృతరాష్ట్రుం డింకేమి యనిష్టంబులు పుట్టనున్నవియో యని వగచుచుండె.

నిజరూపాలోకనజనచయ దాహభయంబునం జేసి ధర్మజుఁడు వస్త్రాంతమున వదనంబు గప్పికొనియె. సంగరాంగణంబున బాహుబలదర్పము సూపఁగంటినని భీముండు బాహువుల నతి విశాలములుగఁ జేసె. ఇంతకంటె దఱచుగ బాణంబు లేసి పగరఁ జెఱుతునని యర్జునుం డిసుమునల్లుచుండె. నిజసుందరరూపంబు చూచి జనులు దుఃఖింపకుందురు గాపుతమని నకులుండు ధూళిధూసరిత శరీరుండయ్యె. దీనంబైన తన యాననంబు సూడఁగలుగు నెగ్గువారింపఁ దలఁచి సహదేవుండవనత వదనుండయ్యె. ఆరీతిగా వారేగుసమయంబున

చ. "తడసినయేకవస్త్ర పరిధానముతోడ విముక్తకేశియై
దొడరుచు దుఃఖభావమున ద్రోవదిపోయె మహాపథంబునన్
బడిన నిజేశమిత్రసుత బంధుజనంబుల శోకవేదనం
గడుకొని, యిట్టులేగుదురు, కౌరవభామినులంచు దెల్పుచున్.

పురోహితుండగు ధౌమ్యుండు రౌద్రయామ్యసామోద్గతుండై భారత మహారణనిహతులగు కౌరవుల పరలోక విధుల సూచించుచు నేగెను.

అవ్విధంబునం గల పౌరులెల్లరుఁ బాండవుల ననుగమింపం జూచినను ధర్మజుచే మధురంబుగ నివారితులైరి. భూసుర ప్రకరంబుమాత్రంబు పట్టుపట్టి ధర్మజునే యనుగమించుచుండిరి. అట్లు చని చని పాండవులు బ్రాహ్మణసహితంబుగాఁ గామ్యక వనమున కేగిరి.

ఇట్లుండ నొకనాఁడు యాదవపాంచాలాదులు పాండవులం జూడఁ జనుదెంచిరి. వారెల్లరు నత్యంత ప్రియంబుతో అన్యోన్య హితభావలాడు సమయంబున ద్రౌపది కృష్ణుపాలికిం జని యిట్లనియె.

"కృష్ణా నీవు సర్వశరణ్యుండవు. నీయంతఃకరణ ప్రవృత్తికి నగోచరంబెద్దియు లేదు. అయినను నావరాభవం బెఱింగించెద. దయతో వినవేడెద.

పాండు మహీపతి కోడలనై పాండవుల ధర్మపత్నినై, విశేషించి నీసోదరినై యుండియు దుశ్శాసనుచే నిండుసభలోఁ దలపట్టి యీడ్వంబడి పరిధాన మొలవంగఁబడితి. ఒరులువోలెఁ బాండవులపుడు సూచుచుండిరి. ఆపగాతనూజుఁ డాదిగాఁగల్గు వృద్ధబంధుజనులు చూచుచుండియు మిన్నకుండిరి. కాని నోరెత్తరైరి. భర్తృ భ్రాతృ పుత్ర బంధుజనంబులు కలిగియు నాకు లేనివారైరి. అట్టియెడఁ గర్ణుండు నన్నుఁ జూచి నగియె. వాని నగవు దుశ్శాసనుని చెయిదికంటె దారుణ శిఖయుం బోలె నామనంబు నేచుచున్నది.

కృష్ణా! ఇందు వింతయేమి! బాల్యంబునుండి యనేకాపకారంబులు దుర్యోధనుఁడు చేయుచునేయున్నాఁడు. ఇపుడు

రాజలోకసమక్షంబున నధర్మద్యూతంబునఁ దమ్ము నిరాకృతులఁ జేసినను బాండవులు పరాక్రమ పరాఙ్ముఖులైయున్నారు. ఇంక నాపరిభవం బెట్లుడిగెదరు?"

అని పాణిపల్లవంబున బాష్పసమ్మార్జనంబు సేయుచున్న దాని నంత నోదార్చిరి.

కృష్ణుండు పాండవుల నోదార్చి, విశేషించి ద్రౌపదికి ధైర్యంబు గలపి పాంచాలురతోఁ గూడి చనియె. పాండవులునుఁ గామ్యక వనంబునుండి ద్వైతవనంబున కరిగిరి.

అంతఁ బాండవులు దుఃఖోపశమనంబులైన కథలు చెప్పికొనుచుఁ గాలంబు ద్రోయుచుండిరి. ఎడనెడ ధర్మరాజునకు ద్రౌపది కర్తవ్యంబు తెలుగు సూచించుచు క్షమకంటెను దేజంబు ప్రధానమని నుడువుచుండు.

తమ్ముఁబీడి తపస్సుచేయ నేగిన యర్జునునింజూడ ధర్మరాజాదులు ద్రౌపదీసహితంబుగా గంధమాదనపర్వతమున కభిముఖులై యరుగుచుండిరి. వారప్పర్వతంబు సమీపించిరి. అంతనొక్క మహామారుతము వీచెను. మహారేణుపటలంబంధకారంబును బోలె నీరంధ్రంబై కప్పె. ధాత్రీరుహ శాఖలు విఱిగి పడుచుండె. వారును దరు గుల్మలతావితానంబులు కరతలంబులం బాయం ద్రోయుచు విశాలతరు థృఢమూలంబు లాశ్రయించిరి. యగ్నిహోత్రంబుతో ధౌమ్యధర్మజసహదేవులొక్కచోటను, భీమసేన ద్రౌపదు లొక్కచోటను, నకులబ్రాహ్మణు లొక్కచోటనుగా నందఱు వేఱువేఱనుండిరి.

తోడ్తోఁగాడ్పుతోడి వాన పెద్దయుం బ్రొద్దు వర్షించె. అదియుడిగిన యనంతరము నందఱునొక్కచోటికివచ్చి యెప్పటి యట్ల చనుచుండిరి. అతివిషమశిలా సంకటపథంబున నడువ నేరక ద్రౌపది యొకచో మూర్ఛితయయ్యె.

పవనతనయుండక్కోమలి నెత్తికొని యజినాస్తరణంబు పయిం బెట్టి కదళీదళంబుల వీచుచుండె. ఆమె పల్లవపాద తలంబులు తమకరంబుల మెత్తన కవల వారలొత్తుచుండిరి.

అట్టి యవసరంబున ద్రౌపదింజూచి దుఃఖితుండై ధర్మతనయుండు.

“మృదుసుకుమార శయనతలంబుల శయనించుచునిత్తన్వి పరుసంపురాలయందుఁబడి తీవ్రవేదన బొందినయది; “మహాపురుషులు పాండవులకుఁబ్రియభార్యయై సుఖముండు”నని ద్రుపదుండు సంతోషపడియుండు. ఇట్లగుట యెఱుంగనేరఁడుగదా!” యని విలాపించుచుండ శీతపవన సేవ్యమానయై ద్రౌపది మూర్ఛ తేరె.

ఆమె నాశ్వాసించి ధర్మజుండు భీమున కిట్లనియె. “ఈ రాజపుత్రితో నీపాషాణదుర్గమపథంబులఁ జనఁగా నేరము, ఏమి చేయుదము!”

భీముండపుడు నిజపుత్రుండగు ఘటోత్కచుం దలంచె. అతఁడును రాక్షససైన్యాన్వితుడై తత్క్షణమవచ్చె. భీముండు వానిం గౌఁగిలించుకొని యిట్లనియె.

“ఇది భవన్మాతఅధ్వగమన ఖిన్నయై యున్నది. కడు నబల. దీని నెత్తుకొని మా సమీపంబునఁ జనుదెమ్ము.”

వాఁడును "ఇమ్మార్గం బతిపరుషశిలా విషమంబు. పాదచారుల కగమ్యంబు. కావున మిమ్మందర నెత్తికొని యాశ్రమంబున నరిగెద." అని ధౌమ్య పాండవ ద్రౌపదులం దానెత్తికొని, బ్రాహ్మణుల నెత్తికొనఁ దనబలంబులం బంచె.

అట్లందఱు గగనమార్గంబునఁ జని బదరీవనంబు గని యందాఱు దినంబులు నివాసంబు చేసిరి. అంత నొక్కనాఁడు భీమ ద్రౌపదులు గంధమాదనసాను రత్నవేదుల విహరించుచున్నచో లలితమగు సహస్రపత్రకమలం బొండు వారి చెంగటఁ బడియె.

ఆసౌగంధిక కమలంబు చూచి దాని యపూర్వ రామణీయకంబునకు, ననన్యకుసుమసాధారణంబైన సౌరభ్యంబునకు నోటువడి ద్రుపదరాజపుత్రి, "అక్కటా! యిది యొక్క పుష్పమయ్యు నపూర్వంబై, మనోనయనానందకరంబై యున్నది. ఇట్టి కుసుమంబులు కడుం బెక్కులు కావలదె! అవి కురంగటం గలవేని తెచ్చి యిచ్చి నాకు మనః ప్రియంబు సేయుము" అని భీము బ్రార్థించె.

భీముండును నామె యభిమతంబు చేయంగడంగి ధనుర్బాణంబులు ధరించి యక్కమలంబు తెచ్చిన గాడ్పున కభిముఖుండై గమనవేగం బొప్పఁ జనుచుండె.

అట్లు చనిచని కొండొకచో నొక్క సరోవరంబు గని యందుఁ గృతావగాహుండై నవనళినదళమృణాళవలయాలంకృతుండగుచు దాని వెలువడి శంఖధ్వానంబు చేసె.

తత్ప్రాంతంబున గుహాశయనుండై హనుమంతుండు నిద్రించుచు శంఖధ్వానంబువిని ప్రియుండడి మార్గనిరోధంబుగా శయనించి లాంగూలలీలాచాలనంబు జేసె.

తద్ధ్వనికి భీముండు విస్మితుండై చని హనుమంతుం గాంచి, కపివరులాంగులంబు నడ్డంబుగానుండ నత్తిపోదమని యత్నించి యెత్తనేరక, కృతప్రణాముండై "నీ వృత్తాంతం బెఱింగింపు" మని ప్రార్థించె.

కపివరుండును నిజవృత్తాంతం బెఱింగించి నన్ను రణ రంగంబునం దలంచునది· నీ యందు సౌహృదంబున నావహం బులో నతిరథుండైన యర్జును రథధ్వజంబు నందుండి మీ బల పరాక్రమంబుల జూచుచుందు" నని భీముం గౌఁగిలించుకొని వానికి సౌగంధిక సరోవరంబు మార్గంబు సూపి చనియె·

తదాలింగనంబున విగతశ్రముండును విపులజవశక్తి యుక్తుండునై భీముండు సౌగంధిక పద్మవనముంజొచ్చి దాని రక్షకుల బరిమార్చి, వైదూర్యనాళంబులైన కనకకమలంబులు, తన్ను వెదకికొనుచు ధర్మరాజాదులతో వచ్చుచున్న ద్రౌపదికి నిచ్చె·

పాండవులు తత్ సమీపంబున నివాసంబు చేసికొని యందు విహరించుచుండిరి· అంత నొక రాక్షసుండు బ్రాహ్మణ రూపధరుండై పరశురామశిష్యుండ నని పాండవుల సేవించు చుండె·

ఒకనాఁడు భీముఁడు మృగయా వినోదార్థ మడవికినరుగ బ్రాహ్మణవేషధారి యగు జటాసురుండను నా రక్కసుఁడు

ధర్మజ నకుల ద్రౌపదుల నెత్తికొని మహాజవమునఁ బరుగిడు చుండె.

సహదేవుండు భీముని బిలిచికొని వచ్చె. భీముం డటు పోవుచున్న దక్కసునితో ఘోరసంగ్రామంబు చేసి వానిం బుడ మిం బడఁ జేసి ధర్మరాజాదుల రక్షించె.

పాండవులటఁ గొన్ని దినంబులుండి గంధమాదన పుణ్య తీర్థావలోకనపరులై మాల్యవంతాదులఁ జూచుచుఁ బోవు చుండిరి.

అందొక్కనాఁడు అశ్వరథియను పుణ్యనదివలన మారు తానీతంబులై సువర్ణమయంబులై తమ ముందటంబడిన పంచ వర్ణసురభికుసుమంబులం జూచి యందఱు విస్మయంబందిరి. పిమ్మట నేకతంబున నొక్క శశికాంత శిలాతలంబుపై నున్న భీమసేనునకు ద్రౌపది యిట్లనియె.

"ఇక్కుసుమంబులు నాకు దెచ్చియిచ్చి మనఃప్రియంబు సేయుము". భీముండు తత్‌క్షణంబ చని చక్రవాళనగ సమున్న తంబైన గిరిశృంగం బెక్కి శంఖధ్వానంబు చేసి పఱతెంచిన రాక్షససేనల నాశము చేసి, మణిమంతుండను వానియుక్కడంచి త్రుంచి పూవులం ద్రుంచుకొనిపోయి ద్రౌపదికొసంగె.

# త్రొమ్మిదవ ప్రకరణము

అర్జునుండు అభీష్టప్రదాయకంబుగాఁ దపంబొనరించి దేవేంద్రాదులకుఁ బ్రియంబుగా నివాతకవచ కాలకేయాదుల వధించి దివ్యబాణములతో ప్రయోగోపసంహార విజ్ఞానముతో నర్జునుఁడు ధర్మరాజాదులకడకు వచ్చెను.

పాండవు లామరుభూమియందు సరస్వతీమహానదిని నను దినస్నానపానాది విశేషంబులఁ బరితోషంబునొందుచుఁ గొన్ని దినంబులు వసియించిరి. తదనంతరంబ ద్రౌపదీ ధౌమ్యాది సహితులై కామ్యక వనంబునకుఁ బోయి యచటి మునులచేత నభినందితులై సముచితవర్తనంబుల నుండిరి.

అంత నొకనాఁడు అప్రమేయ తపఃప్రభావ విభాసి అగు మార్కండేయ మహాముని ధర్మరాజునకు "శ్రీకృష్ణ భగవానుఁడు భవదీయదర్శనార్థం బీక్షణంబ యరుగుదెంచు" నని చెప్పుచుండఁ జారుపతాకాది భూషితగగనమైన దివ్యరథంబున, సత్యభామ నిజోత్సంగ తలంబునందు వెలుఁగొందుచుండ విజయం చేసెను.

తోడ్తో రథావతరణంబుచేసి ధర్మనందనున కభివందనం బాచరించి, భీమార్జున నకుల సహదేవులం గౌఁగిలించుకొని, ద్రౌపది గారవించి ధౌమ్యాది మహీసురులచేత నభినందితుండై అభీష్టకథాగోష్టిం బ్రవర్తిల్లుచుండ.

అట్టియెడ కృష్ణవల్లభయైన సత్యభామయుఁ బాంచాలియు నేకతంబ ప్రియసల్లాప సంసక్తలై యుండిరి.

సత్యభామ ద్రౌపది కిట్లనియె.

“నిర్మల చరిత్రులు, ప్రకట తేజులు, లోకపాలనిభులు నగు నీప్రియభర్తలను నీవొక భంగిని వదలక యత్యంతంబు ప్రియంబుతో నెబ్భంగి భజింతువు? నీయందు వారేవురు నొక్కొక్కొక్కనికంటె ననురక్తులై యుందురు. ఇది యద్భుతంబు. ఎప్పాటునను నీదెస విరతులకుఁ గిన్కయనునది లేదు. ఎవ్వడును నగు మొగంబుల నిన్నె వీక్షింతురు. ఇదేమని వ్రతము కెంపా? మంత్రౌషధ వైభవంబా! సరసనైవధ్య కర్మ కౌశలమా! చతురవిభ్రమోల్లాస రేఖయా! ఏమితల్లీ! ఏ విశేష సౌభాగ్యహేతువు నాకుఁ జెప్పువుగా!

నీవలన నిదియంతయు నిజముగా నెఱింగి నేనును శ్రీకృష్ణుని వశగతుని జేసికొని అత్యంత స్నేహాను భోగములచేఁ దలిర్చుచుందును.”

అని సత్య యడుగఁగా మది నించుక కినుక వొడమగా నణంచుకొనుచు, నిర్వికారాకృతియై ద్రౌపది యిట్లనియె.

“దుష్టవనితలవలెన నన్నును దలఁచుటకు నీకు మనస్సొప్పెఁగా! వాస్తవముగా నీవు పురుషోత్తమునకుఁ దగిన వనితవుగాఁదగవు” అని మేలంపు చందంబున నావె వివేక హీనతనెఱుకపడఁ బలికి పాంచాలి వెండియు నిట్లనియె.

చ. “అలయక మంత్రతంత్రవివిధౌషధభంగులఁ జేసి యెంతయున్
వలతురె నాథులంట మగువా! కడుబేలతనంబు దాన మున్
గలిగిన ప్రేమయుం బొలియుఁగాని యొకండును సిద్ధిఁబొంద ద
ప్పొలతులతోడి మన్కి యహిపొత్తుగఁ జూచు విభుండెఱింగినన్.

చ. మగువ యొనర్పు వశ్యవిధి మందులుమాయలు నొందుచందమై
మగనికిఁదెచ్చు రోగములు, మానక మూకజడాంధ భావముల్,
దెగినొనరించునద్దురితముల్ దనచేసినచేఁతలై తుదిన్
జగమున కెక్కు నిందయును సద్గతిహానియు వచ్చునింతికిన్.

క॥ కావునఁ బతులకు నెప్పుడుఁ
గావింపఁగఁదగదు కపటకర్మంబులు త
ద్భావమెఱిఁగి పతివర్తిని
యై వనిత చరింప వలయు నెల్లవియున్

పాండవులయెడ నెట్టిదాననై యిట్టిసౌభాగ్యంబునందితినో యది నీ కెఱింగించెద. సావధానంబుగా వినుమది.

ఎపుడునేని నేనహంకరింపను. మదప్రమాదములు లేక వారిచిత్తమెకముఖంబుగ భక్తిసేయుదు. కోర్కియుఁ, జూపుఁ, బల్కులుఁ, జెయ్వులు వింతగాఁజేయను. యక్షగంధర్వసురల యందేని నన్యపురుషుని దృణముగాఁ దలంతును. ఎన్నఁడుఁగాని పతులకుముందుగా స్నానభోజన శయనాదులనాచరింపను. పతులకు నాసనపాద్యవిధులను బరులఁబనుపక నేనకావింతును. వారలకు మజ్జనభోజనాదిక్రియలును నేనయొనర్తును.

ధనధాన్యములురిత్తగావ్యయంబగుటకు నోర్వను. గృహస్థల భాండవిశోధనమ్ము లేమఱక సల్పుచుందు. బంధుజనులకు సంతతము ప్రమోదము కూర్తును.

పలుమాఱుఁ దలవాకిట మెలగుటగానీ, అసతీజనమిత్రత గానీ, కలహంబులకుఁ గారణములగు పలుకులు పలుకుటగానీ, నాకుఁ గానివేరవి.

ప్రియులు ప్రవాసులైయుండు నెడలఁ బుష్పాభరణగంధాదుల ధరియింపక తద్గతమతినై తదాగమంబు కాంక్షించుచుందు.

అత్తయెడ భక్తిగలిగి యాయమ యాజ్ఞ ననుసరించి చేటికావృత్తము లాచరించుచుందు. అతిథి జనులకుఁ బూజనాదులు స్వయముగాఁ జేయుదు. ప్రియంబు, మెత్తదనంబు, తాల్మి మొదలగు సుగుణంబుల నెన్నండు వీడ. పాండవులత్యంత మృదుస్వభావులని తేఁకువచెడి చరింపను. కోపంబడరినచో వారాశీవిషముల వడువున క్రూరులని వెఱపుతోఁ గొల్చుచుందు.

మాయత్తయగు పృథాదేవికి స్నాన భోజనాదికములందు నేన పరిచర్యచేసి యామెను బ్రీతి బొందించెద.

నిత్యంబు ధర్మరాజు పంతిని బసిండి పళ్లెరములయందుఁ బుణ్యులగు బ్రాహ్మణులు పదివేలు, యతులు పదివేలు భుజించుచుందురు. వారందఱకు నన్నపానంబులందు నేనుసహాయనగుచు ఉచిత వస్త్రాభరణాదుల సమర్పింతు.

ధర్మజుని నగరియందు మణిభూషణాలంకృతులైన పరిచారకులు నూఱువేలు గలరు. అభ్యాగతభోజనంబు లొడఁగూర్చువారును నూఱువేలు గలరు. వీరెల్ల నిట్టిట్టి మెలఁకువుల మెలంగుదురని తత్కృతాకృతంబులు నేన యెఱుంగుదు.

మఱియు నిరంతర మదధారాతరంగిత కపోలంబులైన భద్రగజ శతసహస్రంబులును, ప్రభూతజవసత్త్వ సంపన్నంబులైన యుత్తమాశ్వశతసహస్రంబులును గలవు. వాని కన్నింటికి నిత్యోచితంబులైన ఖాద్యంబు లొనరింపను, బరిపాలింపను దగినవారి నేన నియమింతు.

అఖండ భాండాగారపూరితంబులైన యగణ్యమణి కనకాది సమస్త వస్తువులును, ప్రతిదిన విహితంబులైన యాయవ్యయంబులు నా యెఱుంగని యవి లేవు. గోపాలజనంబులు తుదిగాఁగల సకల భృత్యజనంబుల జీవితంబుల నరసి యేన నడుపుదు. యశోధనులగు పాండునందనులు నిజకుటుంబ భారంబు సర్వంబును నాయంద సమర్పించి తారునిర్భరులై యిష్టవిహారంబుల నుండుదురు. ఏ నెల్లవెంట నప్రమత్తనై ప్రవర్తింతు.

వేకువజామున మాత్రము వెడనిద్రఁ బొందుదు. అంతియగాని రాజ్యభారయుక్తిం జేసి నా కాహారనిద్రలకే యెడ ముండదు.

ఇట్టి వర్తనములతోఁ బాండవులకుఁ బ్రియము సేయుచుందును. కాని నీవు చెప్పు మందులుగాని మ్రాకులుగాని, యింద్రజాలములుగాని నాకుఁ దెలియవు"

అనవిని లజ్జాకలిత చిత్తయగు సత్య, ద్రౌపదికిట్లనియె.

"మానినీ! నే నెఱుఁగక యిట్లాడితిని. నా పలుకులను నగవుగఁగొని నా నేరమి సైపవలయును. నీచరిత్ర మత్యంత సన్మానితము."

పాంచాలి మందస్మితాననయగుచు "నది యట్లయగుగాక" యని పలికి వెండియు నిట్లనియె.

ఊర్జితముగా ధర్మాన్వితముగా సుశీలంబుగా భర్త మనస్సు నాచికొనునట్టి చతురోపాయంబు సెప్పెద వినుము.

చ॥ పతిగడవంగ దైవతము భామినికెందును లేదు ప్రీతుఁడై
పతిగరుణించె నేని కలభాషిణి భాసురభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము, విశ్రుతిసంతతియున్, యశంబు స
ద్గతియును గల్గు, నొండు మెయిఁ గల్గునె యన్ని తెఱంగులారయన్.

అత్యంతము శ్రమించినఁగాని యైహికాంతసుఖము ధర్మ గతియు నెందుఁ గలుగదు. భర్తృశుశ్రూష సంతతసుఖంబు చేకూర్చు: ధర్మ వాదవఁజేయు,

కావున నిత్యంబు వెరవు, భక్తి, ప్రేమ ప్రియము గలిగి పతియెడఁ జరింపుము. మఱియు

ఉ॥ వనజాక్షుండు గడంగి నీదగు గృహద్వారంబు చేరంగ వ
చ్చినఁ గాంచి లెమ్ము సంభ్రమముతోఁ జెన్నొందు నభ్యంతరం
బునకున్ వచ్చిన నాసనాదికరణంబుల్ దీర్పఁ దత్తజ్ఞనం
బు నియోగించితినంచు నుండక ప్రియంబుల్ సేయు మీవుం దగన్.

చ॥ తిరిగి మురారి నీవు, గడుఁదీవుగఁ జెప్పినపల్కు గల్గినం
గువలయనేత్ర! నీమనసు గూడినవారికి నైన నెప్డుఁ జె
ప్పవలదు దానఁ బొండొక నెపంబు ఘటించు రెఱింగి రేని నీ
సవతులు కృష్ణుబుద్ధి విరసంబగు నీదెసఁ దప్పియుక్తిచేన్.

చ॥ పతికి ననుంగు లైన తగుబంధులమిత్రుల భోజనాది స
త్కృతముల నాదరించుచు నకృత్రిమభక్తి విశేషసంతత
స్థితమతి వై చరింపుము తదీయహితేతర వృత్తు లైన వా
రతివ భవత్సహోదరజనములైనను గైకొనకుండు మెప్పుడున్.

అదియుంగాక ప్రద్యుమ్నాది భవత్తనయులతో నైన నేకతంబున నేకాసనంబున నుంట దూష్యము. సతుల చరిత లతి దుష్కరములుగదా! కులవతులు, సతులునగు మగువలతోఁ జెలిమిఁయొనరింపు. ఇది నీకుఁ బరమసౌభాగ్యమూలంబైన యుపాయంబు."

నావుడు సంప్రీతచిత్తయై సత్య యిట్లనియె. "నీవు ధర్మజ్ఞవు. నీపతులు దేవసన్నిభులు. అత్యంతశౌర్యాన్వితులు నీపుత్రులు. ఏవిధముననునీకుధరణిరాజ్యముసేరెడి. వగవవలదు. ప్రతివింధ్యాదులైన నీపుత్రులందఱుయదుపురంబున సుఖంబున్న వారు. వారలకు నొక్కటం గొఱంతలేదు. వారలదెసనిశ్చింతవు గమ్ము.

నీ మహానీయోపదేశంబు నా కెన్నటికేని విస్మరింప రానిది. ఆచరణము నందుఁ బెట్టవలయునది. నీ యుపకృతికి గృతజ్ఞురాల."

అని పలుకు నవసరంబునఁ గృష్ణుఁడు పాండవులవీడ్కొని మార్కండేయాది విప్రజనంబు నామంత్రణంబుచేసి గమనోన్ము ఖుండయ్యె. సత్యభామయు యాజ్ఞసేనింగౌఁగిలించుకొని సగౌ రవంబుగా వీడ్కొనియె. అంత వాసుదేవుండు ప్రియాసహి తంబుగా రథారూఢుండై ద్వారవతీపురంబునకరిగె.

# పదవ ప్రకరణము

సత్యాకృష్ణులు సనినయనంతరంబు పాండవులు కామ్యకవనంబు పరిత్యజించి, యనేకవనశైల నదనదీవిశేషంబు లాలోకించుచు ద్వైతవనంబునకుం జని యందుసద్ధముపై నెనిమిది నెలలుండిరి.

తద్వనంబున నొకనాఁడు ధర్మజుఁడు నిద్రించుచుండఁగా ద్వైతవనంబునఁ గల మృగజాతులు కలలోవచ్చి కన్నులనశ్రు వారి దొరఁగఁ దమ్మెత్తింగించి ధర్మజుతో నిట్లను.

"ధర్మాత్మ! మీరనుదినము చంపఁగఁజంపఁగా అస్మత్కులంబు లల్పావశిష్టములైనవి. మేము బీజమాత్రము చిక్కియిట్లువసరుచున్న వారము. మీరింక నొండుకడకునరిగి మముఁ గావవలయును."

ధర్మజుఁడు "అట్లకాక" యని వాని కభయమిచ్చి మేల్కని దానినంతయు ననుజులకెఱింగించి, మరల కామ్యకవనంబునకుంజని యందుఁ దృణబిందు నాశ్రమంబున సోదరాది సహితముగా సుఖముండె.

ఒక్కనాఁడు పాండవులేవురు తృణబిందు నాశ్రమంబున ధౌమ్యసహితంబుగా పాంచాలినునిచి మృగయావినోదార్థంబు నలుదిక్కులకు నరిగిరి.

తదవసరంబున సింధుసౌవీరనాథుండగు సైంధవుండు చతుర్విధబల సంగతుఁడై సాల్వకన్యను పెండ్లియాడుటకు నిజవైభవ ముల్లసిల్లగాఁ జనుచుండి, యాశ్రమద్వార సమీపమున

నందు ఆవనభూమియంతయు దేహకాంతిపటలంబున వెలుంగఁ జేయు ద్రౌపదిని జూచెను. అమ్మగువయందుఁ దగిలిన చూపుఁలను మగుడఁ దిగుననేర్పు లేక నిజసఖుండగు కోటికాస్యుజూచి యిట్లనియె.

"ఇమ్మగువ యెవ్వతియో! ఏకతంబ యివ్వనంబున నిట్లున్న నిమిత్త మేమియో? ఈమె సురయక్షగంధర్వకన్యల నొకతెగానోపు. మహీతలము నుగ్మలులకు నిట్టిచెలువున్నదియే?

ఈయబల కెంజిగురాకు లీలఁ గ్రాలు తనకెంగేలు కదంబ శాఖ తుద గీల్కొలిపి, పావకజ్వాలవోలె చిత్తమెటియింపఁ దొడంగినది. ఈ యబ్జాక్షి నా హృదయేశ్వరియైనచోఁ ద్రిలోక రాజ్యాధిపత్యము చేకూటినట్లు విలసిల్లుదు గదా!

వయస్య! ఎట్లేని నీ కాంత నొడంబడఁజేసి, నన్నుఁ జరితార్థుని జేయఁ బ్రార్థించెద."

కోటికాస్యుండును గ్రక్కునఁ బాంచాలి పాలికిం జని యమ్మగువ కిట్లనియె.

"మృగనేత్ర! దారుణ మృగసంచార యోగ్యంబైన యివ్వనాంతరంబున నేకతంబ ఇట్లుంటకు హేతువేమి! భవజ్జనకత్వమున నుజ్వలితుండగు పురుషుం డేవంశమ్మునవాఁడు! నీ జీవితేశ్వరుండగు సుఖజీవితాత్ముడవఁడు? నీనామమై యింపు లొలుకు శబ్ద మెయ్యది!

నాతెఱంగెఱఁగఁ దలఁచితేని వినుము. సురథుఁడను రాజపుత్రుండను; కోటికాస్యుఁడను వాఁడ. ఆ కాంచనరథముపై నున్నవాఁడు త్రిగర్తవిభుఁడు. నిన్నుఁ జూచుచున్న యతని

ప్రక్కనున్నవాఁడు కళింగాధిపతి. ఆపద్మాకరము పొంతనుండి నినుఁగనుఁగొనుచున్నవాఁడు ఇక్ష్వాకుకులోద్భవుండగు సుభగుఁడు అదియట్లుండె.

సౌవీరకుమారులు పన్నిద్దఱు చేరి కొలువగా అనేక సహస్ర కరితురగరథపదాతి పరివృతుండై మహాగజంబుపై శోభిల్లుచున్న యవ్వీరుండు జయద్రథుండు. అమ్మహీపతి యిప్పుడు నీ తెఱంగెఱుంగ నన్నునిటఁ బుత్తెంచె."

అనినఁ బాంచాలి మృదుసంభ్రమంబునం గదంబశాఖ విడిచి, యుత్తరీయంబు సంగతంబు గావించుకొని, యతని కిట్లనియె.

"అన్న నేనిచట నొంటియున్నదాన. నీవిచటికేగుదెంచుట నీతియా? సుతవతిని ధర్మవతిని నగు నన్నితర కాంతఁగాఁ దలఁచి పెక్కులు పల్కుచుంటివి. ఇది నీకుఁ దగునె? నీవు శిబి వంశోద్భవుండగు సురథపుత్రుండవగుట యెఱుంగుదు. అన్మత్ప్రకారంబు చెప్పెద. వినుము.

ఏను ద్రుపదపుత్రికను. పాండవుల ధర్మపత్నిని. అవ్వీరులిపుడు నన్నివ్వనంబున నునిచి నల్దిశలకు వేఁటవోయిరి. వారలింతకు వత్తురు. మీరమ్మహాత్ములకు మాననీయులరు, కావున వారు సేయు సత్కారంబులు గైకొని పోవుదురుగాక. ఒక్కింత తడ వియ్యాశ్రమ సమీపంబున విశ్రమింపుఁడు" అని పలికి యల్లన యవ్వరవర్ణిని * భయంబున బర్ణగృహంబు సొచ్చె.

* వరవర్ణిని: ఉష్ణకాలమున సుఖశీతలమును, శీతకాలమున సుఖోష్ణమునునైన యంగములు గలిగి భర్తయందనురాగముగల యుత్తమ స్త్రీ.

కోటికాస్యుండును గ్రమ్మఱఁజని సైంధవునితో ఆ వృత్తాంతంబుసెప్పె. అర్ధరాత్రమందు అమ్మగువ నపహరింపఁదలఁచి కతిపయజనసమేతంబుగా నరిగి పర్ణగృహంబు ప్రవేశించి యామె కిట్లనియె.

"వామాక్షీ! నీకు కుశలమే! నీమగలేవురకు నెమ్మదియే"

ద్రౌపది యిట్లనియె: "పాండవులకు సేమము. నీకు ననామయంబె? కురువర్యులయింటికి విందవైతివి. ఆసనక్రియా పాద్యములు గైకొని భోజనము చేయ వేడెద. విభులు వేటవోయిరి. ఇప్పుడ వత్తురు వారువచ్చి నీకు వలయునట్టి ప్రియము లాచరింతురు."

సైంధవుం డిట్లనియె. "అంబుజలోచనా! నీవు చేయు నతిథికృత్యము లొక్కటియేని కొఱంతలేక వచ్చినవి. ననుఁ గృతార్థుని జేయుము. లెమ్ము. నమ్మితో రథమెక్కుము.

రాజ్యంబు సర్వంబుపాసి కాంతారస్థలవాసులై పరివారెల్లరు నవ్వఁగాఁ గుత్సితదశయందున్న పాండవులంగొల్చిన సుఖంబుండునే? ఎంతబేలవైతివి? శ్రీవిహీనులఁ గామినులర్థింతురా? నిఖిలసింధు సౌవీరభూవలయ రాజ్యగౌరవంబుతో నన్ను నేలుకొనుము.

అనినఁ బాంచాలి ప్రకంపితచిత్తయై కొంపాకతొలంగి వానియెడ నవమానదృష్టిఁజూచుచుఁ, దనపతులరాక యగోరుచుఁ బ్రతివాక్యంబులఁ గొంతకాలక్షేపంబు చేయుటకై వానికిట్లనియె.

"పాండవులకుఁ జెలియలగు దుస్సలకుఁ బతివగు నీవు నాకుఁ దోఁబుట్టువవు. పాడితప్పిన పలుకులు పలుకనగునా? ధర్మాన్వయమున జనించితివి. ఉభయలోక విరుద్ధమగు పథమేల?

సైంధవుండు దరహాసితాననుండగుచు నిట్లనియె. "నీ వెన్నడు రాజధర్మము విని యుండలేదా? రాజులకుఁ బ్రమదాజనము నెడ వాని వెనుకంగ బనియేమి?

అనిన నయ్యంగన క్రోధకలుషితాంతరంగయై "యిప్పాపాత్ముడు ప్రియవచనంబులఁ బోవఁడు, చెట్టిదంబులగాని చక్కఁ బడఁడు". అని తలంచి యతకిట్లనియె.

"నృపాధమా! ధైర్యసారులు నభంగుర విక్రములఁ బాండుయశస్కులునగు పాండుకుమారుల నాత్మలోఁదలఁచక నను ధిక్కరించనవేల? నీదుగర్వ మింతతోఁబోదు. దుష్ప్రలాపములు దక్కుము. పాండవులాజిలో నమరాసురకోటికేనియు దుర్జయులు. వారికిఁ గీడుసేసి పాతాళమునందు డాఁగినను మృత్యువు తప్పదు. తేలును గర్కటియును దెగు కాలంబునందుఁ జూలు దాల్చుగతి పాండవుల యిల్లాలినైన నాదెస దుర్శీలుండవైతివి. ఇది నీ వినాశ చిహ్నము." అనిన సైంధవుండు నవ్వుచు నవ్వెలంది కిట్లనియె.

"వెలఁదీ! పాండుకుమారవర్గము మాకు వింతయా! మాటలచే మమ్ములనేల భీరులరీతి వెఱపింపఁ జూతువు? మమ్ము వినుము. సౌవీరకుల ప్రసూతులము. మాయం దితర క్షితీశ సాధారణబుద్ధి చేయకుము. ఇఁక వలవని మాటలవలనఁబ్రయోజనంబు లేదు. వేగంబ యల్ల కనకరథం బెక్కి నల్ల మహాగజంబు నొండె నెక్కుము. బీరంపుమాట లాడక ప్రియవచనంబుల నస్మత్ప్రసాదభాజనంబ వగుము."

అనిన యాజ్ఞసేని వాని కిట్లనియె.

"వీరపత్నిని వీరసోదరినై కాలగతిచే ననాథవిధి నున్న దాన. ఎటుల నైనను నాకు నిను( దెలుపనేల? పలుకు లియ్య నేల? అతులిత వృష్ణి కేకయబలంబులతో శ్రీకృష్ణుఁడు, ఘోర గదను దాల్చి సమరకేళీలోలుఁడై భీముఁడు, గాండీవజ్యా వినాదమున దిక్కులుపిక్కటిల్లుచుండ నర్జునుండు, వచ్చినపుడు కన్నారఁగఁ జూచిగాక నీశ్రుతులృడగునా? మత్పాతివ్రత్య మహిమంబు జేసియే నన్నే కీడు నందదు.

అని పలికి యద్దురాత్ముండు తన్నుఁ బట్ట సమకట్టుట యెఱింగి తమ పురోహితుండగు ధౌమ్యునింబేర్కొని యాక్రో శించె. అతఁడతిరయంబునఁ జనుదెంచు నానమయంబున సైంధవుండు పాపనిశ్చయుఁడై ద్రౌపదికొంగు కడంగిపట్టె. ద్రౌపది కోపముతో వాని నదల్చుకొని, త్రోయఁగా వాఁడు భూమితలంబునఁ జిత్రంబుగఁ ద్రెళ్ళె. జయద్రథుండట్లు నేలం బడియుఁ దడయక లేచి, యామెం దిగిచి, రథంబుపై నిడికొని సపరివారుండై యరుగఁదొడంగె. అప్పు డప్పొలఁతి పురోహి తునకు మ్రొక్కన నమ్మహాత్ముండు సైంధవుఁ బేర్కొని యిట్లనియె.

"రాజకులమందుఁ బుట్టిన వారికి ఏతాదృశ దుష్కర్మము తగునా! సైంధవా! నాదు పలుకు వినుము. ఈమె సాధ్వి. ఈమెను వేగ విడిచిపెట్టుము. పాండునందనులు నీప్రాణములు గొందురు. పోవిడువరు. ఈ పాపము నిన్ను ద్రెక్కనక

విడువడు" అని యాక్రోశించుచు నమ్మహీసురవరుం డామె పిఱుంద చనియె.

ఇటఁ బాండునందను లనేక మృగంబుల వధియించి యందరు నొక్కెడం గూడికొని యాశ్రమాభిముఖులై వచ్చునెడఁ బెక్కు అశుభనిమిత్తంబులఁ గాంచి మనంబు లాకులంబులుగా రథంబులు సత్వరంబుగాఁ దోలుకొనుచు యాశ్రమంబు సమీపించిరి. అటఁ బాంచాలి పరిచారిక ధాత్రిక యనునది యతికరుణంబుగా నేడ్చుచుండె. ధర్మతనయు సారథియైన యింద్రసేనుఁడు డిగ్గి నఱికిచని "యిదేమి! నేలంబడి పొరలుచు నేడ్చుచున్నదానవు. నీకపకారంబు సేసినవారలెవ్వరు? అనియె.

ధాత్రిక వానింజూచి "సైంధవుచేతఁ బాంచాలి చెఱవోయె. దేవేంద్రప్రతిములైన యేవురుపతుల నాత్మఁగొనక వాఁడింత యకార్యంబుచేసె. వాస్తవముగా వానికిఁ జేటు మూడియే యిట్లు సేసె.

ఇంతకు మున్న వాఁడు సనియె. వాఁడు మిక్కిలి దవ్వరుగకుండగనే యత్యంతరయంబునఁ జనుఁడు. తోడ్తో శస్త్రము దొడుగుఁడు. వానివస్త్రములఁ గట్టుఁడు. నెచ్చెలిని దెండు" అని పలుకుచున్న ధాత్రిక పలుకులువిని, దాని నాశ్వాసించి యక్కురువీరులేవురు నాక్షణంబ సన్నద్ధులైక్రోధావేశంబునం జేసి మహోరగంబుల భంగి రోజుచు జయద్రథుఁడు వోయిన దిక్కుంబట్టి చనుదెంచుచుండిరి. సైంధవువెన్నిడి, సైన్యము పిఱుంద నాక్రోశ విహ్వలుండై పోవుచున్న ధౌమ్యుంగని నమస్కరించి "మీరింక ఖేదంబుదక్కి రండు" అని పాండు

నందనులు సైంధవుసేనవయింగవిసి సింహనాదంబులు చేసిరి. పాండుపుత్రుల యరదంబుల నూచి సైంధవుండు ద్రౌపది కిట్లనియె.

"ఈవచ్చువారెవ్వరు నీ మగలా ? వీరిలో నెవ్వం డే విధమువాఁడు ఎఱుంగవలయునను నభిలాషనై నడిగితి.

పాంచాలియునాదర క్రోధ ఘూర్ణితయగుచు, ఇంక వీరి నెఱింగిననేమి! ఎఱుఁగకుండిననేమి! దుర్మదమున దుష్కార్య మొనరించి నీచేటు నీవ తెచ్చుకొంటివి. అయినను నన్నడిగితివి గాఁ జెప్పెద, వినుము. ఇంతియగాని నీవలన నాకు భయమిను మంతయు గలుగదు. సోదర సహితుండగు ధర్మనందను గంటి. ఇంక నాకుఁ గుశలంబ.

మ॥ "తనువృత్తాంగుఁడు శుద్ధకాంచనసముద్యద్వర్ణుఁడు త్ఫుల్లస
ద్వనజాతాయతచారులోచనుఁడు దివ్యద్యూభ్రి తేజోఘనుం
డనఘుం డల్ల రథంబుపై వెలుఁగు పుణ్యాత్ముండు ధర్మాత్మజుం
డనిరోధప్రతిభా ప్రభావనిధి యత్యైశ్వర్యశౌర్యుండనిన్.

చం॥ ఘనజవసత్వ చారుతురగంబులఁ బూన్చినయల్లవిస్ఫుర
త్కనకరథంబుపై నతిరసాయుఁడు సాలమహీరుహంబు చా
డ్పునఁ దనరారుచున్ వెలయుఁ భ్రూకుటియున్ దళితోష్ఠపీడనం
బును నఱయున్న వాఁడనిలపుత్రుఁడు భీముఁడు భీముఁడాజులన్.

ఉ॥ ధర్మజుకూర్మితమ్ముఁడును దత్ప్రియశిష్యుఁడు సైనకాఁడు స
త్కార్ముఁడు కాఁడె చూడుము ప్రగాఢవికీర్ణ జితేంద్రియుండు దు
ష్కార్ములఁగన్న సైపఁడు నికామభయంకర విక్రమక్రియా
నిర్మథితారి ఫల్గునుఁడు, నిర్మలతేజుఁ డజేయుఁ డేరికిన్.

చ. ఆయనయసంగ్రహుండు వినయవ్యవహారు భయార్తలోకసం
శ్రయుఁడుఁ గృతాస్త్రుఁ డాహవవిశారదశౌర్యుఁడు శిష్టబాంధవ
ప్రియుఁ డసమానసుందరగభీరసుధాకృతి యల్లపుణ్యుఁ డా
రయ నకులుండు పాండుసుతరత్నము భాసురకీర్తి యమ్మహీప.

ఉ. వీరుఁడు చిత్రయోధిదృఢవేది కృతాస్త్రుఁడు ధారిబుద్ధివి
స్ఫారుఁడు వాగ్విశారదుఁడు పార్థులకూరిమితమ్ముఁ డుజ్జ్వలా
కారుఁడు ధర్మదక్షుఁ డవికారుఁడు ప్రౌఢపతంగతేజుఁ డ
ధీరుఁడు పాండవుండు సహదేవుఁడు దేవనిభుండు పెంపునన్.

వీ రేవురు నత్యంత దుర్వారులు. వీరి బారింబడిన నీ సైన్యంబు సకలంబు వికలంబగు. నీవును బ్రాణంబొండ మానంబొండఁ గోల్పోవక మైమైఁబో నేర్చదవే! ఇప్పుడేని బుద్ధిగలిగి ధర్మజు నాశ్రయింపుము. ఎట్టిశత్రువునైన శరణముసొచ్చిన వారి నతండు కరుణతో రక్షించును."

అనిచెప్పు నవసరంబునఁ గౌంతేయులు సైంధవసేనం దలపడి దిఙ్ముఖంబులనెల్ల జీఁకట్లుగలియునట్లు బాణపటలంబులు వఱ్ఱంగింపదొడంగిరి. సైంధవుఁడునునిజయోధులఁబురికొల్పుచు నాహవభూమినిలిచె.

ఇట్లు త్రిగర్త సింధుసైన్యంబులతో ననేకనరపతి పరివృతుండై నిలచిన సైంధవుంజూచి, భీమసేనుండు క్రోధారుణలోచనుడై గదాదండబు త్రిప్పుచు వానిపయింగవిసె. అడ్డపడినవారినెల్ల, బొదువుచు రథికులను మదగజములను బదాతులను దురగములను దుర్వారగతిఁ జమపుచుండె. ఆ ధర్మజ నకుల సహదేవులును వైరిసేనఁ దెగటార్చుచుండిరి. గాండీవజ్యాని

నాదము మిన్నుముట్ట నర్జునుండు శైబ్యులను నిక్ష్వాకులను సైంధవులను ద్రిగర్తలను దునిమి తూటాడె.

అపుడు రణభూమియంతయు శవమయమయ్యె. అంబరంబంతయుఁ గబంధమయమయ్యె.

అట్టి క్రందున జయద్రథుండు ద్రౌపదిని దిగవిడచి రథంబు తోలుకొని పఱచె. ధర్మజుండు ధౌమ్య సమన్వితయై యున్న పాంచాలింగని నిజరథంబుపై నిడికొనియె. అపుడు భీమసేనుండు ధర్మజున కిట్లనియె. "ద్రుపదసుతను దోడ్కొని నీవు ధౌమ్యుఁడు కవలు ఆశ్రమంబుకుఁజనుఁడి. నేను నర్జునుఁడు సైంధవుని వెనుకముట్టి నిహతుఁ జేసెదము."

అనిన ధర్మతనయుండు "చెలియలగు, దుస్సలనుదలఁచి వానినొక తప్పునకుసైచి పోనిండు" అన ద్రౌపది భీమార్జునులతోడ "నప్పాపాత్ముదెసం గృపఁ జేయవలవదు. అవశ్యంబు వానివధియించి నాకుఁ బ్రియంబుగావించునది. ఇట్టి ద్రోహి యెల్లభంగుల వధ్యుండు." అనియె.

తదనంతరంబ ధర్మనందనుండు ధౌమ్య ద్రౌపదీ నకుల సహదేవ సహితుండై యాశ్రమంబునకుంజనియె. భీమవిజయులు రథంబులు రయంబునఁదోలుకొని, చని, క్రోశమాత్రాంతరంబున సైంధవునిగనిరి. కిరీటి దూరాపాతవిశిఖంబుల జయద్రథురథ్యంబులఁబడనేసె.

అపుడు సైంధవుఁడడరిపడి యరదముడిగి మేనెల్లఁ జమర్ప, నూర్పులు వెల్లిగొనఁ బఱచుచుండె. వానిఁజూచి నగుచు భీమార్జునులు డాసిరి. భీముఁడతిక్రోధంబున వానినొడసి

తలంబట్టి నేలంబడ దిగిచె. ఒడలెల్ల బిండిపిండిగఁ బొడిచె. అర్జునుండుచూచి, "యింత చాలు. ఇంక నొడిచినఁ బ్రాణవిముక్తుండగు. అజాతశత్రువచనంబులు దలంచి వీనిఁగరుణింపు"మనియె.

భీముండపుడు వాఁడికత్తియెత్తి వగతుశిరము చెక్కు-లెగయఁగొఱిగి, పెడకేలుకట్టి రథంబుపైనిడుకొనియె. భీమార్జునులంత నిజాశ్రమంబునకుంజని ధర్మపుత్రునకు నివేదించి "వీఁడ పాండవదాసుఁడ" నిరి. "అట్లని వీఁడు వధ్యుండుగాఁడు. విడిపింపుఁడ"ని ధర్మజుండనియె.

పాంచాలియు జయద్రథుంజూచి నవ్వుచు "ఇప్పాపాత్ముండు భవదీయ దాసుండయ్యెఁగావునఁ బోవిడువుండు" అని వానివిడిపించె. సైంధవుండు పాండవులకు మ్రొక్కి లజ్జావనతవదనుండగుచు నాచోటు వాసిపోయె.

# పదునొకండవ ప్రకరణము

పాండవులు వనవాసంబు సముచితంబుగా సలిపిరి. పండ్రెండవయేటి కడపట వారికి ధర్మదేవతా సమాగమంబయ్యె. తత్ప్రసాదంబున నజ్ఞాతవాసంబునకు భంగంబుగాకుండ వరంబు వడసిరి. అంతకుమున్న తమవెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబుఁ దోడకొని వర్తిల్లు భూసురోత్తముల సగౌరవంబుగ వీడ్కొని, భావ్యాపరివారంబును సముచితరీతి వీడ్కొల్పి, ద్రౌపదీ పాండవు లతిరహస్యవృత్తి నజ్ఞాతవాస విధానంబును నిర్ణయించుకొనుచుండిరి.

కంకుండను నామంబుతో సన్యాసిగా ధర్మజుఁడును, వలలుఁడను పేరితో వంటవాఁడుగా భీముండును, బృహన్నల యను పేరితో నూర్వశీ శాప మనుభవించుచు, నుత్తమ కన్యాజనులకు నృత్యము గఱపువాఁడుగ నర్జునుండును, దామగ్రంథియను నామముతో నశ్వశిక్షకుండుగ నకులుండును, తంత్రీపాలుండను పేరితో గోష్ఠంబున కధిష్ఠాతగా సహదేవుండును, మత్స్యదేశంబున విరాటురాజునొద్ద నుండ నిశ్చయించుకొనిరి.

ధర్మజుఁడు పాంచాలి నాలోకించి ఖిన్నాంతఃకరణుండగుచు

చ॥ ఇదికడుమద్రరాలు పనులేమియుఁజేయఁగనేర దింతయున్,
మృదు వొకకీడుపాటునకు మేకొనఁజాల దుదాత్తచిత్తయుం
టిదియగుదానికోర్వ దొకటిం దనుఁడా సవరించుచొప్పెఱుం
గదు తగవొల్లనుంగొలువగా నెరవెప్మెయిఁ గల్గునక్కటా!

అనియె. అతని చిత్తంబున వెనుఁబాటంతయు మానునట్లుగా ద్రోవది యిట్లనియె. 'సైరంధ్రీవేషంబున నంతఃపురము చెంతకుఁ బోయెద. పట్టపు దేవి పిలువనంపును. పోయి యంతఃపురమునఁ గొలువు చేసికొనుచు మలీమస వృత్తంబున పొంతపోవక మాలిని యను పేరితో జరించుచుండు. కలపంబులు తనువున నలదుట, మృగమదంబునఁ దిలకంబు రచియించుట, పువ్వుల ననేక ప్రకారంబులఁ గట్టి ముడికొక్క-రీతి నెత్తులు గట్టి యిచ్చుట మొదలగు కార్యములఁ జేయుచు వివిధ శిల్పములఁ బ్రవీణనై మత్స్యరాజమహిషి మనస్సున కెక్కు-నట్లు ప్రవర్తించుచుండు. మున్నెచ్చటనుంటివని వారు ప్రశ్నించినచోఁ బాంచాలికడనుంటినని చెప్పెద."

ధర్మాత్మజుఁడు ద్రౌపది కిట్లనియె. "మన వంశంబును వృత్తంబును, బెంపును రక్షింపనోపునట్టి మహాసాధ్వివి. అచటి తులువల తలపులు గనుఁగొని యేమఱక మెలగుచుండుము."

యాజ్ఞసేని యనాదరమందస్మిత సుందరవదనారవింద యగుచు నిట్లనియె. "ఎందును గౌరవభావం బెసలనీక పాతివ్రత్యాచారముతో సైరంధ్రీజాతివారు చరియింతురు. కావున నేనును మితభాషావిరచనము, ప్రతిసంభావనము, పాపభయముగలిగి యుచిత రీతినుందు."

ఇవ్విధంబునఁ గార్యంబు నిశ్చయించుకొని యగ్నిహోత్రంబుల ధౌమ్యుని యొద్ద నునిచి హుతవహునకుఁ బురోహితునకుఁ బ్రదక్షిణము జేసి, పాండవులు పాంచాలిఁ బురస్క-రించుకొని కాననమార్గంబున బడిపోవుచు విరాటునగరంబు గడిచేరిరి.

అందుండి యూళ్ళు సారక యడవి తెరువుల నడచి విరాటు నగరంబున కనతి దూరంబగు కాంతారంబునఁ దటిమిపోవు సమయంబునఁ బధి శ్రమంబు నూని యాజ్ఞసేని యిట్లనియె. "దప్పి పుట్టుచున్నది. వ్రేళ్ళు పొక్కిపోవుచున్నవి. గోళ్ళలో నెత్తురులు చిప్పిలు చున్నవి. నాకుఁ జిత్తంబు వశంబుగాక యున్నది ఆపుర మిచ్చటచ్చట యను నాశల వచ్చితిని. ఎంత దవ్వు గలదో! ఇప్పటి నాళంగిచూడ నొకయడుగైన వేయఁజాల."

అపుడు ధర్మజుండు తనమనమునఁ గరుణయు, ఖేదంబును బిరిగొనుచు నుండగా నాతని యనుమతిని సవ్యసాచి యకొక్కమలి నెత్తుకొని పురము చేరవచ్చె.

అట పాండవులు తమ తమ యాయుధంబులు ప్రేత భూమి పరిసరా రణ్యము నందుఁ గల యొక మహా శమీ వృక్షంబునందునిచి మహోరగంబులం బెట్టి బంధించు తెఱంగున వాని గట్టివేసిరి.

తదనంతరము వారచ్చోటు వాసి పురాభిముఖులై చను చుండిరి. అజ్ఞాతవాస కాలంబునఁ దమ రహస్య వ్యవహారంబునకు ననువుగా నేవుర పేళ్ళను గ్రమమున జయ, జయంత, విజయ, జయత్సేన, జయద్బలు లని సంకేతించి కొనిరి. ధర్మదేవతానుగ్రహముచే దోడ్తోనున్న యునికిని వారి వారికిఁ దగినట్లు వేషంబు లేర్పడ సంతసించుచు విరాట్రాజును జేరి యాతని యనుగ్రహపాత్రులై యుండిరి.

ఇట్లేవురు చనిన పిదప సముచితభంగి సైరంధ్రీ వేషముతో నించుక వలపలి దిక్కునకుఁ గురులు దుఱిమి, పరిధారి

కాత్వరేఖావరిణతి తన తనువున నచ్చుపడగా, ద్రుపదకన్యక పురము సొచ్చెను.

పౌరజనంబులు రాజవీథి నవ్వేలఁదిఁ జూచి,"ఏజగంబునఁ గాని యిట్టి సతిజన ముందునా! ఈలతాంగి మొయిలు కప్పిన యమృతాంశుకళ' అనుచు నంతంతం జేరి, "నీ వెవ్వరవు ఏమి పనికై యెచటికి బోవుచుంటివి?" అనిరి.

ద్రౌపది యిట్లు సెప్పెఁ. ఏను గట్టువాలు దానను. కడుపు కూడు పెట్టి, కట్టఁ జీరయిచ్చి నను నెవరేలుదురో యట్టి వారికిఁ బనులు చేసి మెలఁగు బుద్ధితో వచ్చితి."

అనవుడు జనులా విని సందియంబు నచ్చెరువు నలరు మదితో "ఇచ్చెలువ కడుపు కూటికి నచ్చోటనేని నిలుచు నఁట. ఇది వలుకు నే!" అనుచుఁ గనుఁగొనుచు ముసురుకొని చనుచుండిరి.

పాంచాలరాజనందన రాజమందిరంబు చక్కటికి నరిగె.

ఆసమయంబున విరాటునిదేవేరి సుధేష్ణరమ్యహర్మ్యము తుదిని బ్రియసఖిజనముతో విహారము చేయుచు ద్రౌపదిఁ జూచి కుతూహలంబున ఇదియొక రమణీయ కాంతామణి. ఎక్కడనుండి యెక్కడికిఁ బోవుచున్నదో! నీచభామినులరీతి వినీతయై వలుకుచున్నది. పౌరులును వెక్కసమంది చూచు చున్నారు. వేగమ దీనిని దోడ్కొనిరండు" అని ప్రౌఢాంగ నల వనిచె. ద్రౌపదియుఁ దనతలపు నెరసెనని కేకయసుతానుచారికల వెంబడిచనియె.

విరటుమహిషియు, మొగంబున గౌరవంబును, గేలఁ బురఃప్రసారమును, దనువున నమ్రభావమును గడల్కొన భూరితరాదరముతో "ఇందురమ్మ" అనుచుఁ దద్రూప మాపాదమస్తకము వీక్షించుచు నిట్లనియె.

"నీకులమేమి? నామమేమి? ఎవ్వరిదానవు? ఏమిపనిబూని ఎచటి కేగుచుంటివి? మా కెఱుఁగఁ జెప్పుము." యాజ్ఞసేని యిట్లనియె.

నేను సైరంధ్రిజాతిసంజాతను. నాయభిదానంబుమాలిని. పురుషపంచకసనాథనైయుండియు ఒక్కకారణంబున విరోధులచేతఁబతులసన్నిధిని దలపట్టి యీడ్వంబడితి. వనంబున కరిగి వన్యాహారంబులం గాలంబు గడిపితి. ఇటమీఁద నియమాచరణంబునకు నొక్క వత్సరంబు గొఱంతగలదు. నీవు ధర్మవర్తినివని విని నానేర్చు పనులవెంట నీకడ నిలువఁ దలంచి యిందువచ్చితి."

నావుడు సుదేష్ణ యిట్లనియె. "సుర గరుడ యక్ష సిద్ధ తరుణులలో నీవొక్కతె వగుదువు. ఇవ్వారికిఁ జనుదెంచిన కారణమును బొంకక చెప్పుము."

అన దరహాసము తనమోమునకుఁ దోడవుగా ద్రౌపది యిట్లనియె, "ప్రథమమున శ్రీకృష్ణదేవియగు సత్యభామకుఁ బనులుచేసితి. పిదపఁ బాంచాలికడఁ బరిచారికావృత్తి వర్తించితి. ఆదేవి నాకుఁ బ్రాణంబు ప్రాణమై రక్షించుచుండెడిది. నీవును నీచపుఁబనులకు నాచాలమియెఱిఁగి, మన్ననకుఁ బాత్రముగాఁగైకొని, యాచారము తప్పకుండ నన్ను రక్షింపుము.

నేను గలపములు కూర్పఁగలను. తిలకంబులు దిద్దఁగలను, పువ్వులు దండఁగ్రుచ్చి తల ముడువఁగలను."

కేకయ రాజనందన, యత్యాశ్చర్యముతో నిట్లనియె. "నీరూపము చూచి మారాజువివ్విళ్ళూరును. నిన్నెమ్మెయి నేను బనిగొందును? ఇంతులే నీపైఁజూడ్కి నెక్కొల్పి విస్మయమంది చూచుచున్నారు. ఇఁకఁ బురుషులసంగతి వేఱచెప్పనేల! ఇట్టి నిన్నుఁగైకొని నాకై నేను విధ్వంసదశ తెచ్చుకొనుట వరవై యుండునా!"

పాండవ ధర్మపత్ని యిట్లనియె. "నీ తలంచినట్లుకాదు. నాపతులు గంధర్వులు. లావువిక్రమముగలవారలు. నన్నెవ్వఁడు నేమఱరు. నీచమతి నన్నెవ్వఁడుచూచునో వాని నారాత్రిలోఁ దెగఁజూతురు కావునఁ బురుషులు నాదెసం దేఱిచూడ వెఱతురు.

అదియుంగాక నాచిత్తము తాదృశులకు గోచరముకాదు. అతినీచవచనములు నాకడఁ జెప్పకుము తల్లీ!

ఇఁక నెమ్మనమున నూరడిల్లుము. అనుమానము మానుము. నన్నేలుకొనుము. భయభక్తులతో నుదాత్తనాగరక భంగుల నీమది కెక్కునట్లు మెలంగెద. సాధువృద్ధులు మెచ్చునట్లు వర్తనము సల్పెద.

నను నీచకార్యములకుఁ బనుపక, యెంగిలి లోనగువానికి లోనుకలుపక తగు మన్ననతో నరయువారలకు నన్మత్పతులుపకృతులు చేయుదురు."

అనిన సుధేష్ణ సంతసిల్లి ద్రౌపది నూరడించి యునిచి కొనిరా. యాజ్ఞ సేనియానంతిపురము చరితకలవడ మెలఁగుచుండె.

ఇవ్విధమునఁ బాండవులేవురు నవ్వేలదియు విరటు పుర మునందు సకలజనుల కజ్ఞాతముగా నివసించుచుండిరి.

ఇట్లుపాండవులు పాంచాలీసహితంబుగా విరాటునగరం బున వర్తించుచుఁ గతిపయదినంబులు గొంతగా నేఁడుకాలంబు గడిపిరి. అట్టియెడ మత్స్యపతిమఱంది యు దండనాథుండును, గీచకాగ్రజుండును, రూపాభిమానియు దుర్విదగ్ధుండును నగు సింహబలుండు తనయప్ప సుధేష్ణకు మ్రొక్కఁజనుదెంచె.

అద్దేవి కనతిదూరంబుననున్న ద్రుపదరాజ నందనం గనుంగొని ఆమెపై నెక్కొనినమోడ్కని గ్రమ్మఱుప నేరక తెగడొందుచుండె.

అయ్యెడ "నను వీఁడు చూచెఁగదా" అనుచితకృత్యంబు లాచరించునేమో "ఇచట నాకుదిక్కెవ్వరు!" అనుభయమున మేనఁ గంకంబుపుట్టఁగా జేయుటకు నేమియు నుపాయంబు గానక పాంచాలి దిగులొందుచుండెను.

అంత గీచకుం డక్కోమలి కలరూపు నిజసహోదరివలన దెలియందలంచి పాంచాలిఁజూపి వేగపడుచు "ఈ మెకుల మేమి! చరిత్రమేమి! నాథుఁడెవ్వఁడు! ఇచట నేమిపని జేయుచుండును! అనియడిగె. సుధేష్ణయు అతని చిత్తవృత్తి మఱలుప నలనివలు కులు గీటువంబుచ్చి పొందువలుకులుపలికె. కీచకుండు ద్రౌపది యున్న యెడకుఁజని,

"నీ వెవ్వరి తనయవు! నీ పతి యెవ్వఁడు? అనఁగా నప్పాంచాలి యప్పలుకులు వినమిగా భావించి నిర్వికారయై యూరకుండక అచ్చపలుండింక, దడయం జాలక తనయభిలాషంబు తెలుప ద్రౌపది మిగులఁ గలుషించి పరిభవ వికారంబు తోపకుండ దన్నుఁదాన యుపశమించుకొని "ఏడు దురభిమాని" వేగిరి పాటు కూడదను. నేరుపుతోడన తప్పించుకొనవలయు నని తలంచి యిట్లనియె.

"అన్నా! నాయున్న భామ దలఁప వేమి? ఈ సొమ్ములు, ఈ చీరలు ఏవపుట్టించు చున్నవి గదా? నీవును నాఁడు బుట్టువు తోడఁ బుట్టినాఁడవు గదా? ఇట్టి మాటలాడఁ జనునే? అదియుఁగాక నేను హీనవంశజాతనయ్యుఁ బతివ్రతను."

అట్లు ఏడఁగఁ బల్కుటయుఁ బ్రయోజనంబు గానక "యితండు నీచుండు గావున జంకించినంగాని మెత్తబడిపోవఁడ"ని తలఁచి యిట్లనియె.

శా॥ "దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
ద్గీర్వాణాకృతు లేవురిప్డు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిం గీచకా."

కీచకుం డిట్లనియె. "నా మహా బాహుబలము, జెనయఁగ ముజ్జగములందు నెవ్వాడును లేఁడు. ఇది నిక్కంబు."

సైరంధ్రి సైరణ దక్కి ధిక్కరించి యిట్లనియె.

అందని మానికండ్లఁ గోయఁదలఁచుట వెఱ్ఱి. మునుఁ జెడిన రావణాదుల నెఱుఁగవా?"

కీచకుండు మొగము చిన్న బుచ్చుకొని చేయునది లేక యక్క యొద్దకు వెళ్లి - "అప్పుడు నీకుం జూపిన యన్వయ నామధేయంబు లడిగిన యప్పొలఁతి యిప్పుడెందుఁ బోయెనో" యని యడిగె.

సుధేష్ణయు నతని వేగిరపాటు చూచి శిరఃకంపంబు చేయుచు, ఏమియుపాయంబు మూఁడునో యని నయంబున భయంబున నేకవిధంబుల బుద్ధులుఁ గఱపి ప్రయోజనంబుగానక యతనియవస్థం జూచి విచారించి, తుట్టకేలకు నిట్లనియె.

"ఇంతదలర నేల! ఆసుదతిని నీ నివాసమునకు దినము లోపల నాసవమునకని యవశ్యము పంపుదును.

అనినవిని కీచకుండు ముదితహృదయుండై నిజసదనంబునకుం జనియె. సుధేష్ణ పాంచాలిరావించి తృష్ణ భావించుచు నిట్లనియె. "అతిశయించు తృషపెల్లిదమ్మైన నావదనము వఱువట్లువట్టె. మదిరారసమానఁగ, నామది వేడ్క జనియించుచున్నది. కీచకునియింట వాచవియగు బహువిధంబుల వారుణి యెప్పుడుఁదీయకయుండు నీగమనవేగము చూతముగాక! అచటికిఁజని వారుణి వేగ కొనిరమ్ము."

అనవుడు నుల్లము తల్లడిల్లఁగాఁ, దనువు ఘర్మజలంబు దాల్చుచుండగా "నచటికిఁ బోవుట యెట్లు? పోనొల్ల ననుట యెట్లు? దైవమా! నేర్పుతో నీయిక్కట్టు పాపికొను దీమన మెట్టిది?" అని తలంచుచు డోలాందోళితమానస యగుచు సుధేష్ణకిట్లనియె. "తల్లీ! ఈపనికి నన్నుడిగి యితరులఁబనుపుము.

నీగృహ మతి నిర్మలచరిత భరిత మని మత్పతుల యుసన్నిధినైనను మతి నూరడిల్లి యుంటి. నేడు నాపై మన్నన దప్పుట పాడియా?

ఎవ్వారి యింటికో, యొద్దికో తీసికొని వచ్చుటకు నన్నుఁ బంపఁదగునె? నాఁడు నిన్నుఁ గొల్వ నేతెంచునపుడు నీచపు బనులకు నేను జాలకునికి చెప్పి యనుజ్ఞ తీసికొనలేదా!

సుధేష్ణయుఁ దాఁ జేయు ననుచితంబునకుమిగుల శంకించి యును దమ్మునివలవంత దలఁచి పాంచాలితో సాదరముగా నిట్లను. "సఖీ వేడ్కపడి ఆసవము తీసికొని వచ్చుటకు నొక నికృష్టను బంపలేక నీకుఁ జెప్పితి. దీని నీవు గోసెక్కెఁ జేసి నిన్ను హీనవిధానమునందు నియోగించితినని యున్మలించితివి ఇది నెయ్యము తియ్యము కల్మియే?

అది లాఁతి యిల్లా! నిను నెఱుఁగని వారెవరు?

అనిమఱియుఁ బెక్కుభంగులఁ బ్రార్థించె. పాంచాలియు నింకఁ బెనంగినను బ్రయోజనము లేదని తలంచి "నీవు గోరినట్టి పనిఁ జేయుదును" అని కాంచనచషకంబు పుచ్చుకొని యార్త మూర్తియై చనుచు,

చం. అలమటఁబొందు మాలవిధి హాయని దైవముదూఱు నిత్తఱిం,
గలఁగొను [illegible]ను, మొగంబున నశ్రులుఁ జెల్లి గొల్పెఁదా
ర్చిలఁబడు జల్లనం జెదరు డెందము గూడఁగఁ దెచ్చి నన్ను గే
వలమును బుట్టు నెవ్వరికివచ్చునసుం గలగుచ్ [illegible]

ఇవ్విధంబు ద్రౌపది దురవస్థం బొందుచు "మహాపద లకు బరిహారణంబు హరిస్మరణ"యని తనహృదయ పుండరీకం బున బుండరీకాక్షు నిక్షేపించుకొనియె.

శిరమ్ముపై కత్తి వెలుంగు వేవెలుఁగుఁగని "పాండు పుత్రులయెడఁదప్పనిమనస్సు గలదాననేని, నో ప్రభూ! కీచకుని వలన నన్నొకకీడునుఁ బొందకుండ రక్షింపుము" అనుచుఁ గేలు మొగిచె.

తరణియు నత్తరుణిఁగాచుటకు భుజావిస్ఫురణాఢ్యుఁడగు నొక్క రక్కసుని బనిచె. వాఁడును బనిపూని రయంబున నదృశ్యాకారుండై వచ్చినిలిచె.

ద్రౌపది కీచకుని మందిరంబు చేరనరిగి బెబ్బులియున్న పొదలుచొచ్చు లేడిచందంబున నందుఁ బ్రవేశించె.

కీచకుండును ద్రౌపది వచ్చు తెరవారయుచు హర్ష సంభ్రమంబులు పెనంగొనఁగాఁ జంచలభావపరీతమూర్తిఅయ్యె. ద్రౌపది తత్ప్రదేశంబునకుంజని "తృషపుట్టఁగా దేవవారుణి తేరఁబనుపఁగా నరుగుదెంచితి" అనుచుండ నింతినెమ్మొగము నందు నతఁడు దృష్టులు నిల్పి "దేవితృషతీర్పఁ బూనితివి. మంచిది. ఆపెసహోదరుండనగు నాతృషయు నీసంభావనమొయి తీర్పకుంట పాడియా" అనియె. ద్రౌపది యప్పలుకులు పెడ చెవులఁబెట్టి ధీరురాలుగాన నిర్వికారయగుచు "వేగంబ మదిర పోయింపుఁడు. అద్దేవి యెదురుచూచుచుండు. తడవైనచో నాపై నలఁగును. అనఁ గీచకుండు "సుధేష్ణపాలికిమదిరను నిత రులచేఁ బంపెదఁగాక! గజతురగ సమితిఁ బొంపిరివోయెడు

నాదు రాజ్యలక్ష్మికెల్ల నీవె పాలకురాలవుగానుండుము." అని యంతకంత కగ్గలించుతమకంబునం జేసి ఆమెంబట్టుకొనియె తన్ను రక్షించుచు వెన్నంటి వచ్చుచున్న దనుజుని మహాబలము తన తనువొందఁగా నాతని విదిల్చి రభసముతో నా మందిరము వెడలెను.

ఇట్లు ద్రోచికొనిపోవుచుండఁ గీచకుండు వెనువెంటఁ దగిలె. అమ్మగువయు మరలిచూచి, భయభ్రాంతయై యెవ్వ లనికింబోడునోయని తలంచి, దైవయోగంబున విరాటుండు బయలు కొలువున నునికిం జేసి యచ్చటికి బరుగిడియె. అతఁడు గర్వోన్మత్తుండు. కావున జనసమూహంబును బరకుసేయక సమదగజము జంగమలత వెనుకొనుభంగి పరభసంబునఁజని కోపంబుతో నమ్మహాసాధ్వి తలపట్టి తిగిచి కూలనేసె.

అట్టియెడఁ బాంచాల రక్షకుండగు రాక్షసుండుఅతనిని డొల్లద్రేసె. ద్రేటుపడికీచకుండును నోడుపుదప్పినమహానాగంబు కరణి నిట్టూర్పు నిగుడ నిట్టలంబగు కోపంబున మల్లడి కొను చుండె.

ఆసమయంబున నయ్యాస్థానంబుననుండిన పవన తన యూఁడు ప్రాణేశ్వరి యవమానమును, సింహబలుని విజృం భణమును, జూచి కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాలుచుండ నతిభయంకరాకారముతో నచ్చేరువనున్న యున్నదవృక్షంబు నిరీక్షించి ధర్మతనయుం గనుంగొనియె. అతం డతని యాకా రంబునూచి, నయనంబుల వారించి, "మన వలలుండి వృక్షము నెక్కడఁ జూచెను. మఱెచ్చట నసేవ్యత్మాజములు లేవా!

పరశాఖలచే నొప్పుచు, నుపాశ్రితప్రతతికి నత్యంతప్రీతి సంధిల్లఁ జేయు నీవృక్షంబును వంటకట్టెయలకై ఖండింప నేటికి” అని నిగూఢభాషణంబుల నతని కోపరసంబు చెఱిచె

ద్రౌపదియు నాయన్నదమ్ముల చేష్టితములసూచుచు దైన్యం బాకృతిఁ గొన్న చందంబున విరాటుని సభఁ జేరనరిగి, పంచిన కోపమును, సమయభంగ భయంబును మనస్సునఁ బెనఁగొనుచుండ, భర్తలను దక్కిన సభ్యులఁ జూచురీతి రూక్షముగా వీక్షించుచు, మత్స్యనాథుఁడు వినుచుండ నెలుఁగు చలించుచుండ నిట్లనియె.

“నన్నొక నీచుఁ డిట్లవమానము చేయుచుండఁగా నన్నిఁటను మహాసమర్థులగు నాగంధర్వభర్త లేవురు మిన్నక చూచుచుంట నచ్చెరువు గదా! ఇంక భూమిలో నెవ్వారి యాఁడువాండ్రు పరిభవంబు లేక బ్రదుక గలరు. అదియట్లుండె.

ఈనరపతి యాస్థానములో నున్నవారిలో నొక్కఁడేని తగవైన వెడపలుక్కైనఁ బలుకఁజాలఁ డయ్యెఁ గదా! ఇందఱు చూచుచుండఁగా నీచుఁడగు కీచకుఁడు పతివ్రతనగు నన్ను నెందును నెట్టిస్త్రీలను నెవ్వరుఁ జేయనివిధమునఁ జేయుఁ గొందఱికేని దయపుట్టదుగదా! ఇఁకఁ జెప్పనదేమి?

అదియెల్ల నాకేల? ఇతండు మత్స్యదేశమున కొడయఁడు. నాకీనరనాథు దూఱనగును. ఎవ్వరైన నధర్మ మొనర్చిన రాజు లారసి దండన మాచరింపవలయు. అట్టిచో నిచ్చో నన్నుఁ దన్నిన కీచకుని జూచి నూరకుంట భావ్యమా!”

నావుడు విరాటుఁడు చిత్తము కరుణాయత్తము కాఁగా ద్రౌపదినిగనుఁగొని కీచకుని దండితునిఁ జేయగాఁ దగుసత్వము లేమిం జేసి సాంత్వనవచనంబులతో నాతని రోషముమాన్పి కీచకుని బంపివేసెను.

సభవారందఱు "ఈశుభలక్షణాంగియగు సుందరి సైరంధ్రికావుట యెట్లు? రాజుచూచుచుండగా నీదురాత్ముం డింతచేయునే! అనుచుగుసగుసలాడుచు మోముల విన్నఁదనంబు గదురగా ఖిన్నులైయుండిరి.

అపుడు ధర్మతనయుండు ఘర్మవారి లలాటభాగమును గప్పగా, విజృంభించు నధికరోషంబును ద్రోచికొనుచు, ధైర్యము పెంపున నిర్వికారుఁడై ద్రౌపదితో నిట్లనియె.

"నీ తెరంగంతయు జననాయకుండు సభవారు నెఱింగిరి. ఇఁకఁ బలుమాటలాడనేల! నీవుసుధేష్ణపాలికి జనుము, గంధర్వులకుఁ దఱిగాదుగాన నూరకుండిరిగాని లేనిచో నీపరాభవంబు నకుఁ గోపింపనేరరా! నాథుల దూఱంగఁగాదు. సతికిసభలలో దడవుగానిల్చి, శంకచెడి, యిట్టు ధిక్కరింపం జనదు."

ధర్మనందనుని పలుకులువినియు సైరంధ్రి యచ్చోటుఁ గదలకనిల్చి యెద్దియేనియుఁ బల్కఁదలంచి నట్లుండె. అదిచూచి ధర్మతనయుండు వెండియునిట్లనియె.

"పలుపోకలుపోవుచు విచ్చలవిడిగా నాట్యము చూపు విధమునఁ, గులసతులగరువంపు చందము ఏడి యిట్లుంటతగునా! తోడ్తో వెడలిపోవుట మంచిది.

పాంచాలి సాభిప్రాయంబుగా నిట్లనియె. "నాభర్త నటుఁడు పెద్దవారియట్లపిన్న వారును. కాన నేనుబతులవిధము కాక శైలూషిగానసంగరాదు. అట్లగుటంజేసి నాకునాట్యంబు సముచితంబును బరిచితంబునునై యున్నది.

అదియుంగాక, మత్పతికితవుండు గూడను. కావున జూదరియాలికి గరువతనంబెక్కడిది!

అని యచ్చోటవాసి, కన్నులభాష్పపూరములు గ్రమ్మ చుండఁగాఁద్రొటిలుచు సుధేష్ణపాలికింజనియె. ఆమెయు సంభ్రమంబు తెచ్చుకొని, తా నేమియు నెఱుంగనిభంగి "చెలీ! మేను చెన్నుదఱిఁగినది. మోముచిన్నవోయినది. నీకురులొప్పుగందినవి. కనుఁగవ విన్ననైనది. ఎవరిచ్చోట నీకేమి కీడొనర్చిరి? వారెట్టిపాటి సాహసికులో? వారింజంపుదు. భంగపఱతు; ఇడుమపఱతు. ఇత్తెఱంగు నాకుఁ జెప్పుము.

ద్రౌపది యిట్లనియె "నీవెఱింగియు నెఱుంగమి భావించిన నేనేమనంగలదానను. అయినను జెప్పెదవినుము. మద్యము తేఁబోయినపుడు కీచకుఁడవినీతి చేయవచ్చె. చేయనీక నేను మత్స్యావనీంద్రుసభ దిక్కుగాఁజనితి. తీవ్రకోపంబున నచ్చో నన్ను తన్నెను."

సుధేష్ణయు "నీవు ఖేదముదక్కుము. కీచకుని దండితుని జేయుదు" అనుచు నత్యాదరవృత్తితో ననునయంబు చేయుచుండఁగా నయ్యసత్యసంవాదిని పూన్కియాలము సేసి ద్రౌపది

"నీవింత యలుగనేల! పగతీర్చుటకుమత్పతులుగలరు." అనినను ధేష్ణయు, దత్పరిజనులును వగఁబొందిరి. ఎన్నిసాంత్వన

ములు చెప్పినను దేలక, మజ్జన భోజనాదులకుం బోలక ద్రౌపది కోపశోక విహ్వాలమైయుండె. అట్టియెడను ధేష్ణ చేయునది లేక నివ్వెరగంది యుండె. తక్కినయంగనలును గీచకుని నీచత్వంబు తలంచి వానిచేటున కొడంబడిరి.

# పండ్రెండవ ప్రకరణము

ఇట్లు పరిభవానల సంతప్తయైన పాంచాలి నిజశయన స్థానంబునకుంజనియు. తల్పంబుపై మేనువైచి యపాంగంబులం దొరఁగుకన్నీరు చెవులకొలుకులనిండ, నెవ్వగలు నివ్వటిల్ల నా యమ యిట్లు తలపోయంజొచ్చె.

"సింహబలుండు ప్రబలుండు. ఆతనిజయింప భీముని బాహుబలంబు చూడఁదగు. ఇప్పట్లనతనికి దైవబలంబును నవ శ్యము గలుగును." ఇట్లూహించు చుండ రాత్రిసమయంబయ్యె. సమస్తజనంబులు గ్రమంబున నిద్రింపఁ దొడంగిరి. ఆమెయు శయ్యాతలంబువిడచి మేనిధూళికడగికొని ధౌతపరిధానపరీతయై వృకోదరు కడకుంజని,

"కీచకుండు నన్ను బరాభవించి మున్నున్న తెఱంగున సదనంబున సుఖోచితశయ్య నిద్రించుచుండె. ఇప్పుడు నీకన్ను మొగడ్చు నూఱుటకు హేతువేమి! నీయన్న పరాక్రమంబు వలదనినఁ గాఁబోలు నాపైదయమాలితివి."

అనుచు మందసంభాషణంబుల సంబోధించు పాంచాలి పాణిస్పర్శంబునమేలుకని, "ఇదియెవ్వ ర"నవుడు, "నేన"ను నమ్మానిని మొలుంగెఱింగి, భీముఁడు "యాజ్ఞసేని కీచకుని దురా గతంబు నాకుఁ బ్రకటించి, వాని నిర్జింప నియోగించునదై యరుగుదెంచెఁగావలయు" నని దలంచుచుండె.

ద్రౌపదియు "భీమసేనా! యకుటిలపాంసనుండు రౌద్రం బున వెంబడించి తలపట్టి తిగిచుట నీవును జూచితివి. అప్పటి

మీయన్న పెద్దతనము నేనునుజూచితి. ఇఁక నేననునది యేమి గలదు! ఆనాఁడాసభలో దున్నసేనుఁడావిధముగామీసుభటత్వ బలములు మిన్నకపోవఁగ నాకవమానముసేసె. జయద్రథుం డనుచితంబొనరింపఁగా నది సెల్లిపోయె. ఈసభికులు కనుఁగొను చుండ నేఁడిట్లయితి. వగ నాకువింతయాయేమి!

ఆడుకూయును నాలకూయును లాఁతివారలయినను నర యవలయు. ఇఁకనందఱిలోఁగీచకుఁడట్లు నన్నుఁదన్ను చుండఁగా ధర్మరాజెట్లు చూడనేర్చెనో?"

భీముఁడది యాలకించి, "మీరాఁడు సరికింపక నిన్నుఁ బరి భవించు కీచకుని, మహోగ్ర కోపవివశుండ నగు నన్నును జూచి ధైర్య హేమాద్రియగు ధర్మజుఁ డట్లు వారణచేయకుం డిన, నేను గీచక మత్స్యవిభుల నుగ్గుచేసి యుందును. ఆ సమ యంబున సమయభంగముగా జనంబులు మనల నెఱింగి యుం దురు. ఇఁకమరల ముందటిభంగిఁ గానలవసియింపవలయుగదా! అది నీవును నేనును దెచ్చిన యాపదగా నెల్లవారును నిందిం తురు. కావున యుధిష్ఠిరుండు పొగడ్తకుఁ దగువాఁడు గాని దూఱువడ నర్హుండుగాఁడు.

ఇంతయేందుకు ? ఇపుడు కీచకుఁడు బ్రతికిపోయెనా యేమి ? ఇట్లు దురిపిల్లనేల ? మనల నెవ్వరు నెఱుంగకుండునట్టి తెఱంగుదలపోయవలయుఁగాకపగతునిభంజించుటయెంతపని?"

అనిన నమ్మానవతి యిట్లనియె. "భీమసేన! వాస్తవ ముగాఁ జెప్పుచుంటి. నేను గుంతికి నంతవెఱవ. మీకు నంత వెఱవ. ఇఁక దైవమునకు నంతవెఱవ. కాని యత్యంతకలు

పాత్మ యగు సుధేష్ణకుఁ బనులు గావించునెడ వెలితుం-
కోపముపట్టఁజాలక, యొక నీచునిచేఁ దుదిపోయి కోలుపోయిన
యభిమానము డెందముఁ గొందలపెట్టఁగా ఏవో కొన్ని పలుకులు
పలికితి. ఇంతియగాని సమస్త జనపూజనీయుండగు ధర్మతనయు
నిక్కంబ నిందించినదానఁ గాను. అతని నిర్మల సద్ధర్మమున
ధాత్రికి నల్ల బ్రదుకగుచుండ మనము బ్రదుకుట యరుదా!
వేయేల! అట్టి రాజసూయ మహాధ్వర కర్త నేఁడొకనికి
నాశ్రితుడై కూడు గుడ్డలుపెట్ట వానిమది ప్రీతికి నీడగునట్లు
సేవించుచున్నాఁడన నాకు ధృతి దూలక యెట్లయి నిల్చును?

ఇఁక బక హిడింబ జరాసంధుల బాహుబలగర్వాదుల
నణఁచిన విజయాకరములగు నీకరములు వంటకట్టెయలకు లావు
చూపుచుండఁ జూచి చూచి వగచుచుండు. మఱియు నిన్న
మహిష వ్యాఘ్ర గజాదులతోఁ బోరించునపుడు నీమూర్తిపై
గన్ను మనముదగిలి యేమఱియుండు నన్నుఁ జూచి సుధేష్ణయు
దత్పరిజనంబులును పెక్కువిధంబులఁ దలపోసి గుజగుజలు
వోవుచుందురు.

మగలకు మేటియగు నర్జునుండు రంగమునందు నిల్చి
వికృతవేషముతో సుందరులకు నాటనేర్పువిధం బతిదీనము.
దానిఁ జూచి దేవపతిసూనుఁడు కడుపుఁబ్రోచికొన నింతటిలఘు
వృత్తికి జొచ్చెనేయని పురపురఁ బొక్కుచుందును.

అత్యంత రమణీయదేహుండగు నకులుం డశ్వశిక్షకుఁ
డఁట. ఆతని దుస్థితి యనుదినంబు గాంచుచుఁ గన్నీరు నించు
చుందు. అట్టి జ్ఞానవంతుఁడు. సహదేవుఁడు గోపాలకవృత్తి

వహించి యటవులఁ దిరుగుచుండఁగా నాక కాదు. విరోధుల కేని మన మెఱియదా? మనము కానలకు వచ్చునపుడు కుంతీమహాదేవి సహదేవుని నాకు నిల్లడంబెట్టి బోరన నశ్రులు గ్రమ్మచుండఁగా

చ॥ "కడుపసిబిడ్డ వీఁడొకఁడు గాదవునా పెంపఁగఁడు ముందఱ
య్యెడనొకపాటెఱుంగఁ డెదయెంతయుఁ గోమల మెన్న డైన నేఁ
గుడువఁగఁ బిల్వఁగాని తనకుంగల యాఁకటి ప్రాదెఱుంగఁ డీ
కొడుకిటు పోకఁ కున్ మనము గుండెడు నిన్నని యూరడిల్లెడున్"

అని యప్పగించె. నేనును వనవాసకాలంబున నా నేర్చు విధమ్మున మీ కెల్ల గారామైన తమ్ముని నమ్మయి బరికించుకొని వచ్చితి. ఇపుడేమి చేయఁగాక చింతిల్లుచున్న దాన.

ద్రుపదుఁడు పుత్రులకంటె నెంతయుఁ బెంపుసేయ పెరిగి కుంతీమహాదేవి కోడండ్రలో గొనియాడఁబరిగి ప్రాణంబులకుఁ బ్రాణంబుగా మీరు దనయ్యంబు తియ్యంబు నెఱపనడిచి తల్లికి మాఱుగా జనులెల్ల భక్తిసేయ నెగడి, సుపుత్రులఁగాంచి భరతాన్వయంబునందు నాయిల్లె యిల్లుగా నతిశయిల్లితి. రాజసూయయాగమునఁ బృథ్వీదేవతాకోటికిఁ దృప్తిఁ గొనర్చితి.

అట్టి నేనిపుడు మనంబు పెంపుసెడి, యుదరపోషణకై దీనతతో సుధేష్ణ కనుసన్నఁ బనులు చేయుచుండ మీకు వగపేమియుం జేయకుండె. ఏమి చెప్పుదు? నన్నుఁ బనిగొనునెడఁ బాండవాగ్రమహిషియఁ గొంకుచుండెడిది. రాజదేవులు పెరవారు రాచినచందనం బొల్లరు. మేనెల్ల జెమర్ప నేన పూయుదును. వారికిఁ నున్నఁదనముగా నలుగు నూరి నూరి నాపాణి

తలంబు చూడు మెటు కాయలుకాఁచెనో" అనుచు నశ్రుల మునిఁగిన మోము వానిపత్త్రమ్మునఁజేర్చె. భీముండును దేహ మలమటఁబొందఁ దక్కరములు తనమొగంబు గదియఁజేర్చి నిట్టూర్పు గాడ్పునిగుడఁ జింతాక్రాంతుఁడైయుండె. అంత నతనిఁజూచి ద్రౌపది యిట్లనియె.

"కావున మీయభ్యుదయాభివృద్ధి నాత్మఁగోరి నే నెట్టి యాపదల కేని నోర్చెద. దానికేమి? నేడీ కావలుఁడగు కీచ కుఁడు తలకట్టి తిగిచి తన్నిన నిమ్మాయి దూఱుచుంటి భీమసేన! వాని దెగటార్పవేని నీవుకనుంగొనుచుండ నురినైన, నగ్నినైన విషంబునైన మేను దొఱంగెద."

వృకోదరుండు చిఱునవ్వునవ్వి యిట్లనియె "జలజాక్షి! కీచకాధముని జంపుటకై యిమ్మాయి మాట్టఁబల్కవలయునా? ఎందఁజొచ్చెనేని, ధర్మతనయుండు తానవచ్చి యడ్డపడెనేని నీవ పెంపారు కరుణగాచితేని నల్లి కీచకుఁడు నాచేఁబడుట నిక్క మము. ఇఁక వానిదెసఁ జింతవలవదు. మనమున నూరడిల్లి యుండుము.

సింహబలుండు నిన్నుఁ బరిభవించి, మైమైతోన యునికిఁ జేసి, మెల్లియుంజెనకవచ్చు. నీవుం గ్రమంబున నొడంబడుట భావించికొని వానికి నర్తనశాల సంకేతంబుగాఁజెప్పి రేయింటి మెయిం జనుదేర నియమింపుము. అచట వానిందెగఁజూచి నీకుంజూపి, నీచిత్తంబు వడసెద. ఇత్తెఱంగుదక్క నొండొక విధంబు కర్జంబుగాదు. ఇదియనిశ్చయంబు. ఇట్లసేయువారము. చూడుము. వేగుచున్నయది, మేలుకాంచి జనంబులు మనల

గాంచిరేని వంచన బయలుపడిన గార్యంబులవ్వా. నీవు శయన స్థలంబులకుఁ బొమ్ము”

అని శయ్యాతలంబు విడిచి, యుత్తన్వ్యందటిమి కొన్ని యడుగులనిపి మరలి భీముండు కలుషితాత్ముండగుచు సెజ్జకువచ్చె. అచ్చెలువయుఁ దననిద్రించు నెడకుఁ బోయి, పర్యంకంబున తనువువైచి యంకిలిదేఱినం డెందంబు గొందలంబుతోడి నిద్రం బొరయని కనుదోయి మోడ్చియుండె.

అంత సూర్యోదయంబయ్యె. కీచకుండు చిడిముడిపాటు తోడ సింగారంబు చేసికొని యతిత్వరితగతి సుధేష్ణమందిరంబున కరిగె. ఎట్లేని నయ్యువిద నీదినమున నియ్యకొనఁ జేసెద నని యువ్విళ్ళూరుచు నందొకచో ద్రౌపదిం గనియె. కని యామెఁ జేరఁగాఁజని బహుప్రకారంబులగు దుర్వికారంబులు సేయుచుండె. ద్రౌపదియాతని గనియుంగానని విధంబుగైకొని తనముందటి పని వెరవుననుండె. అంత నద్దురాత్ముండు ద్రుపదనందన డాయంబోయి “పద్మనేత్రా! నీచరణపద్మములెప్పుడుఁ గొల్వ యోగ్యత గల్గెనేని నది మహాభాగ్యముకదా! నీవునన్నొక్కని నొల్లవా లేక కామసౌఖ్య వైరాగ్యమే నీమనస్సున స్థిరము చేసికొంటివా? నాకుయథార్థము వచింపుము నాపైనొక యింతచూడ్కి నిల్పినమాత్రన మగలసౌభాగ్యము. కుందునా? యేమి చేలా! నాతగుల మాఱడిపుచ్చకుము. నన్నేలుకొనుము. నిక్కమువచింప నేన యీరాజ్యమును బాలన సేయుచుంటి. రాజనునెపంబిడి విరాటునకుఁ గూడుపెట్టుచుంటిని. ఇంతయేలకే

నిన్న నిన్న వేవురు చూచుండ నట్లు త్రోవఁగానొక్క-రుఁడుగాని కాదు కూడదనఁ గల్గెనే! పోటరులైన భర్తలు గలరంటివి. వారియలవును జలమును జూచితిగదా! ఇంక నెవ్వరు గలరు?

అనిన నవ్వేలంది "వీఁడు దమకించి యున్న వాఁడు. నా యంత్రించుమాటలకు మున్న కదియబడ నేని కర్జంబు దప్పు" అని విచారించి, మెత్తపడినయట్లు చూచి; తన హృదయ మెఱింగించురీతి నిట్లనియె. "వలదని యెంత సెప్పినను వినవుగదా! వేగపాటున నల్లెడలఁ దొడరఁ జూచెదవు. విచ్చలవిడి సేఁత కర్జమగునా! విచారము వాంఛకుఁగాని వావియా! నామగలడఁకువ నుండరు. ఇట్టులగుటంజేసి, యొల్లభంగుల రహస్యంబు గోలుపోనిరీతి, భగవదీయ వాంఛ కనురూపం బెట్టులో యట్టుల చేయుము."

నావుఁడుఁ గీచకుండును బొంగి "ఈ విచారములతో వన్నిట్టు లేఁతునగునా! అయినను నీపంపు సేయువాఁడ. ఎయ్యెడ నెప్పుడెటుల నభిమతసిద్ధి యగు, తెలుపుము." అనఁ బాంచాలి తన యుక్తుల వాఁడు తగులుట నిశ్చయించి, యనురాగాయత్త చిత్తవోలె నిట్లనియె. "పగలెల్ల నృత్యము చేసి యుత్తర లోనగు వారు పోవఁగా, నర్తనశాల యెంతయు వేడ్కకుఁ బట్టగుచుండును. అచ్చటికి నీవొంటిమెయి నేఁటి రేయి వచ్చునది." నీవొక్కఁడవ యరుగుదేరవలయును. లేకున్న నయ్యెడ నిలుచుదానగాను. ఇఁక మనమిచటఁ బెద్దయుఁ బ్రొద్దు మనలుటతగదు. పొమ్ము. నేనును నాపని చేసికొనుచుందు."

కీచకుండు వికసిల్లుచు, సమయనిర్ణయము నిజచిత్తము నకు వింపువెంప స్వగృహమునకుఁబోయె. ద్రౌపది సముచిత రీతి మహానసశాలలోనికిఁబోయి. భీమునితో నతనిగూఢక్రోధ వహ్నిరగుల్కొల్పుచు "నాకొఱఁత దీర్చివచ్చితి. ఇంక నీ కొఱఁతయ గలదు." అని సమస్తకథయు నివేదించె. భీముం డును బరమాహ్లాదంబును బొంది, "వాఁడొక్కఁడే మదాంధ వృత్తి నాట్యశాలకు వచ్చును. వెదకిచూచి నన్నుఁ గని సంగ రం బిచ్చు అస్మద్బాహుబలహీనబలుఁడై చచ్చు. ఇఁక విచార మేల? నా బాహుబలమునకు మాఱుకొనఁజాలు భుజబలంబు గలిగి చిక్క, పెనఁగి నన్నొకయింత కినియించెనేని, భూచక్రము సంచలింప, దినమల్లల్లాడఁ, గులపర్వతంబులు కంపింప సము ద్రములు ఘూర్ణనమొందఁ గ్రోధముఁ గృతార్థత్వంబు నొందిం చెద. అని పలుక ద్రౌపది సంచలితస్వాంతయై యాతని తీవ్ర క్రోధంబు గుప్తసాధనంబునకు బాధకంబు కాఁగలదని తగఁచి, "పరులు నవ్వఁగా ధర్మజుండు నెవ్వగఁ బొందఁగా నీవు చేయ నెంచిన పని గూఢవృత్తికి దవ్వగును. అట్టినాఁడు నా యభిమ తం బొడఁగూడియుఁ దుదినిష్ఫలమై పోవును. కావున వంచన బాహిరపోవక యుండునట్లు రిపుఁ బరిమార్పవచ్చునేని ప్రయ త్నము చేయుము. లేనిచో వలదు." అన భీముం డిట్లనియె.

"సంకులయుద్ధ సమయమున రహస్య విభేదభయము నా కొదవునా? ఓపినంతవరకు నిగూఢవృత్తితో నాతని బరి మార్పఁజూతు." పాంచాలియు 'జయలక్ష్మిఁ గొనుమ'ని దీవిం చుచు వెడలిపోయె.

అటఁగీచకుండునుఎట్టకేనియుఁ బ్రొద్దుగ్రుంకఁజంద్రాస్త మయ సమయము దాఁక వేచి శంక లేక మండపాభ్యంతరభూమి కొచ్చె. అంతకుమున్న ద్రౌపదీభీములచటికి వచ్చియుండిరి. భీముండుసెజ్జపై బరుండియుండె. పాంచాలి కొంచెమోసరిలి నిలిచియుండె. అందు సమస్త మంధకారావృతమై యుండె.

అట్టియెడఁ గీచకుండు సెజ్జంజేరి కేలుసాచితోడ్తో మేను గఱుపాఱఁగా "మంచి మంచివస్తువు లేరితెచ్చితి. ప్రియంబున గైకొనుము." అన రోమశకర్కశంబైన హస్తముతో భీముండు వానిఁ దలపట్టి వంచె. వాఁడు గర్వంబున గంధర్వుఁడను తల పుతో భీమునిఁబట్టి త్రోచె. ఇరువురును బెద్దకాలము సంకుల ముగ భయంకరముగఁ బోరిరి. పోరినకొలఁది భీముని బలము పెరుగదొడంగె. కీచకుని లావు తరుగఁజొచ్చె. దానినెఱింగి భీముఁడు పల్లవఫలభరితంబగు మ్రాను గూలఁ ద్రోచుభంగి సూతుఁగూల్చి వికృతపు జావు చంపఁదలఁచి యవయవము లన్నియు మేనిలోనికి నుగ్గుగాఁ దుఱిమి యొకముద్దగఁజేసెను.

ద్రౌపతి గూఢముగా ననలముఁగొని వచ్చి యకృజ్జ ముగ నున్న యాపీనుఁగుఁ జూచి విషాదముతో వెఱగందె. పిదప భీముని స్తుతించె. అతఁడును దోడ్తోఁజని మహానసపరిసరం బున శరీరప్రక్షాళనంబు చేసికొని కృతకృత్యుండై నిజశయ్యా తలంబునఁగూర్చుండె.

ఇట ద్రౌపది "భీమసేనుఁడింతకు వంటయింటికిఁబోయి నిశ్చింతఁబుగ నుండునని నిశ్చయించి నర్తనశాల వెలువడి

కావలివారలం బిలిచి నాగంధర్వపతులు కీచకుం జంపిరని" పలుకగాఁ బెద్దయుంబ్రొద్దు పెద్ద గందరగోళమయ్యె.

ఆ కలకల మెఱింగి యుపకీచకులు నృత్యశాలఁ జొచ్చి సోదరుని రూపఱినకాయముచూచి పలువిధములంఁ బలవించు చుండిరి. "వీరి చందములు చూతముగాక" యంచు నచటికి వచ్చిన ద్రౌపదింజూచి యుపకీచకులు మహాగ్రహోగ్రకోపులై ఇది గదా ఈతని పొడవడగించినది. పెడకేలుగట్టి దీనినీతని యొడలి పయింబెట్టి కాల్చుట లెస్స"యని రాజాజ్ఞ బలవంతంబునఁ గైకొని సూతుని పీనుగుమీఁదఁ బాంచాలిఁ బెట్టికట్టి పితృ వనము దెసకుఁ జనుచుండిరి.

పాంచాలి భయభ్రాంతయై "ఓజయ జయంత విజయ జయత్సేనజయద్బలులారా! అనదనైతి నా కుయ్యాలింపుడు. రక్షింప వేగరావలయు." అని యతిరావముగా నాక్రందన మొనర్చె.

అయ్యెలుంగు భీముండేర్పడ విని వచ్చిచూచి "ఏంద్రింత చేయుదురే"యని పరేతభూమికి లంఘించిపోయి, యొక్క మహావృక్షంబు పెఱికి నిలిచియుండె.

వచ్చు నుపకీచకులు ఆ మహాభయంకరమూర్తింగని శవమటఁ బారవైచి కలఁగఁబాఱిరి. భీముఁడు వారివెంటఁబాఱి నూట యేవు రుపకీచకులనుఁ జేతులతీఁటపోవ నుఱుముసేసె. పిదప శమితక్రోధుండైవచ్చి, పాంచాలీబాధమోక్షంబుగావించి "ఇంకనిశ్చితంబున సుధేష్ణనివాసంబునకుం జనుమని, తానును వేఱొక్కమార్గంబున మహానసగృహంబున కరుగుదెంచె.

విరాటుండు కీచకానుజులను గంధర్వులచేత నిరవశేషంబుగా మృతిబొందిరని విని సహోదరమరణ శోకాయత్తచిత్తయైన జీవితేశ్వరినోదార్చి "అమ్మృగాక్షినిం బురివెడలి పొమ్మని నేర్పుతోఁ జెప్పుము. లేనిచో నాసుందరి కతన నందఱకుఁ జావు మూడు" నని యామె నొప్పించి చనియె.

అంతఁ బ్రభాతంబయ్యె. అట మున్న పాంచాలి సచేల స్నానంబుగావించి, మందమందయానంబులఁ బురంబుసొచ్చి రాజవీధినరుగుదెంచుచుండె. ఆమెం జూచి ప్రజలందఱుభయపడి పాఱిపోవుచుండిరి. వారిఁజూచినవ్వుచు ద్రౌపది మహానసశాల వాకిటనిలిచి భీమసేనుంగని, కీచకులఁజంపి నన్నురక్షించిన పరమ ధర్మమూర్తియగు గంధర్వపతికిఁ బ్రణామిల్లుదు" అని కృతజ్ఞత తెలిపి నర్తనశాలకేగె. అట బృహన్నల సైరంధ్రి కిట్లనియె." ఆపాపాత్ముల నీచవ్యాపారమును వారు మృత్యుప్రాపితులైన తెఱంగును నీపలుకుల నెఱుఁగవలయును. చెప్పుము." సైరంధ్రి సాభిప్రాయంబుగా "కన్యల కాటగఱపుచు సుఖమున్న నీకు సైరంధ్రి యేమయ్యెనేని ఖేదములేమిగదా నన్నిట్లు స్మితాననంబుతోఁ బ్రశ్నించుటకు మనసొప్పె." అని కన్యకాజన పరివృతయై యంతఃపురంబు సొచ్చి, సుధేష్ణ కడకుం జనియె.

ఆమెయు భయశోకంబులతో సంభావనచేసి, తల్లీ! నీవు చక్కనిదానవు. మగవారుధైర్యరహితచిత్తులు. దీనిఁ దలఁచి భయమంది నీవలచునడకు నరుగవలయునని రాజుగారు చెప్పిరి." అని యనుజవియోగతాపం బుత్కటంబుగా వెండియు నిట్లనియె. "బిరుదుగల మగ లున్నారని ప్రతివారిఁ జంపింపఁ

జూతువు. జనములు నీపౌరువునఁ బోవ వెఱచుచున్నారు. మాపురము రాష్ట్రము వీడి యెందైనఁ బొమ్ము."

సైరంధ్రి యిట్లనియె. "ఇఁక మూఁడు దినంబులు మాత్రము నీగృహమం దుండుదును. అంతవఱకు దయతో నియ్యకొనుము. మత్పతులు ఉపకారవ్రతులు. ఈ నరపతికి శుభము లిత్తురు." సుధేష్ణయు అంతవఱకు మద్గృహంబున నుండ నంగీకరించితి" నని తెల్పె.

ఇది ఇట్లుండఁ గౌరవులు కీచకు వధను విని, చంపినవాండు భీమసేనుఁడ గావలయు నని నిశ్చయించుకొని, తేల్చుకొనుటకై సుశర్మయను వానింబంపిన నతఁడు ససైన్యంబుగా వచ్చి విరాటుని గోవులను ముట్టడింప విరాటుఁడు మొదలగువారు వానితో యుద్ధంబుఁ జేయఁ జనిరి.

మఱునాఁడు సూర్యోదయావసరమున దుర్యోధనుఁడు భీష్మ ద్రోణకర్ణాదులతో వచ్చి విరాటుని గోవులను నుత్తర దిక్కుననున్నవానిం బట్టె. పురమునందలి వీరులందఱుసుశర్మతో యుద్ధము చేయుచుండుటం జేసి విరాటుని పుత్రుడగు నుత్తరుఁడు కౌరవసేన మార్కొన నెంచి, సారథి లేమికి విచారించుచుండె. ద్రౌపదియు నత్తెఱంగంతయు నింద్ర తనయునితోఁ జెప్పె. అర్జునుం డజ్ఞాతవాస వత్సరం బతీతంబగుట నిరూపించి, పాంచాలి కిట్లనియె. "నీవు పోయి వారలతో మన బృహన్నలకు సారథ్యంబుసేయు సామర్థ్యంబు గలదు. తొల్లి ఖాండవ దహనసమయమున నర్జునునకు సారథ్యంబుసేసి యతని చిత్తంబు పడసె. తత్సాహాయ్యంబునఁ గురుసైన్యంబు జయించుటకు

సంశయంబు వలదనునది. "అట్లుసేయుము" నని సైరంధ్రి యత్తెఱం గంతయు నుత్తరకుఁ జెప్పె. ఉత్తరయు దన యన్నకు దాని నెఱింగించె. ఎట్టకేలకు నుత్తరుఁడు బృహన్నలను సారథిగాఁ జేసికొని, తత్సాహాయంబున సర్వకురు సైన్యంబును నోడించి గోవులఁ గ్రమ్మరఁ గైకొనివచ్చె.

అంతకుమున్న భీముని సాహాయ్యముతో సుశర్మాదుల జయించి, కుమారుని శౌర్యము విని సంతోషించుచున్న విరాటునకు ధర్మరాజది యంతయు బృహన్నల ప్రభావమని చెప్ప విరాటుఁడు గోపించి యజాతశత్రుని పాచిగొని వ్రేసె. వ్రేటువడి ధర్మజుఁడు అటనున్న పాంచాలిదెసఁజూచె. అయ్యింతియు వ్రేటు గంటిందొరగు రుధిరంబు తన యుత్తరీయంబున మెత్తన యొత్తుచుండె. "అదియేల యని విరాటుం డడుగ సైరంధ్రి యిట్లనియె. "పుణ్యాత్ముఁడగు నీతని రక్తంబు ధరణిపై నెన్నిబిందువులు దొరగునో యన్ని వర్షములు వానిపుట్టుటకుఁ జాలక యిబ్బంగిఁ జేయుచుంటిని"

ఇంతలో నుత్తరుఁడు లోనగు వారందరు వచ్చిరి. విరాటుఁ డుత్తరుని కౌఁగిలించుకొని "యట్టి కురుసైన్యము నెట్టు లోర్చితివి" అని యడుగ నాతండు తనదేమియు లేదనియు, నంతపని బృహన్నల నెరవేర్చెనని చెప్పె. మఱియు నందరకు సమ్మోదముగా నా బృహన్నలే యర్జునుఁ డని యెఱింగించె. అంత నర్జునుఁడు తమవారినందఱ నెఱింగించె. అందఱు పరమానంద కందళిత హృదయారవిందులై యుండిరి. విరాటుఁడు పాండవుల నుచితరీతి సత్కరించె.

# పదుమూడవ ప్రకరణము

అజ్ఞాతవాసంబు నిర్విఘ్నంబుగాఁ గడపిన మీఁదఁ బాండవులు కౌరవులు యుద్ధసన్నద్ధులగుచుండిరి. సంజయుని రాయబారము మొదలగునవి విఫలములై పోయె.

అట్టిసమయంబున ధర్మరాజుఁడు సమస్త పరిజనంబులు పరివేష్టింప, సుఖాసీనుండై యుండి శ్రీకృష్ణునితో నిట్లనియె. "ఇది మిత్రకార్యంబు చక్కఁజేయుటకు సమయము. మాయంశమగు ధరిత్రి సుయోధనునితోఁ బోరాటదక్క యనుభవింపవలయునని యున్నది. కావున నీవు ధృతరాష్ట్రునొద్దకుఁజని తగినమాటలాడి తెఱంగు సేయవలయును. తుదకు మాయేవురకు నయిదూళ్లిచ్చినఁ జాలు నంటినని చెప్పుము."

కృష్ణుఁడును దానికొడంబడియె. భీమార్జున నకులులును సమ్మతించి, తదనుకూలముగా తమతమసందేశంబులు తెలిపిరి. ఒక్క సహదేవుండు మాత్రము సంధికొడంబడక యుండె.

అయ్యవసరంబున ధర్మనందనుని పలుకులు హృదయతాప మొనరింపఁగా మోహమున దైన్యముదోఁప, పాంచాలి శ్రీకృష్ణునితో గద్గదకంఠియగుచు నిట్లనియె.

"అంతలాతలు సేసి సంజయుని చేత రాయబారమంపిరి. దానికి యుధిష్ఠిరుఁడు ప్రియమంది, యయిదూళ్ళిచ్చినఁ జాలు ననుచున్నాఁడు. ఈ యయిదూళ్ళు నేని సుయోధనుఁడిచ్చునా? ఈయ కేమి? ఈయక యాతఁడంత నిర్దయుండై యన్నదమ్ములనేమనా! ఆతమ్మునిమీఁదఁగల కూర్మి పేర్మిచేత నీ యన్న

గారు తాను మునుపడ్డబన్నములు సైఁపకుందురా? రాజ్యము భాగము లేక యేదో యొక రీతి నొడఁబాటు చేసికొనిన లోకులు చాలమివట్టరా? వెంపేదనట్లుగాఁదమకిట్టితక్కువలు రూపించుకొనుటయేలకో? సంధివారికేగదా మేలు! వీరు కౌరవులసాధింపఁ జాలరా! వాస్తవముగాఁ బోరుటకుఁ దలంపున్నచో నిపుడు శంకింపనేల? ఏలప్పైన సైరించుటకు వారు బ్రాహ్మణులా యేమి?

ఓటమి భయము సుయోధనుని చిత్తమునందు లేదు. నీ రాయబారమువలన నేమి ప్రయోజనము? మీఁదు మిక్కిలి వాని దురభిమానము వృద్ధియగును. సరియె. నీవు పోయినను వారు సంధి కొడంబడ రనుకొనుము. అపుడేని పాండవులు పోరున కిచ్చగింతురా! లేక మరలఁ గానలకు ముక్కుమూసి కొని మునీశ్వరులై పోవుదురా?

నే నిట్లు మాట్లాడుచుంటినని కోపింపకుము. నీవు పాండవులు విచారించి మనకార్యము మీ సుజనత్వము చెడకుండు నట్లు కురువర్గముతో సంధి చేసికొనుఁడు. నాకేల?

నేను చిత్తమునందు మాటల నిల్పఁజాలక నూఅట నోరిదాననై పెక్కులు కాఱులు ప్రేలుచుంటి. వినుఁడు.

చ. వరమునఁబుట్టితిక భరతవంశముఁ జొచ్చితి నందుఁ బాండు భూ
వరునకుఁ గోడలైతి జనకంద్యులఁ బొందితి నీతివిక్రమ
సిరులగు పుత్రులన్ బడసితిన్, సహజన్ములఁబ్రాపుఁ గాంచితిన్
సరసిజనాథ! యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్.

అట్లుంగాక—

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవము దలిర్ప సం
భావన సేయు దిట్టి ననుఁ బంకజనాభ యొకండు పట్టి రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణి పట్టి యీ
డ్చె వురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లు సైరుతే.

ఉ. ఆసభ నేకవస్త్ర యగునట్టి ననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసనుఁ జూచుచుం బతులసంభవులై తమ చేష్టలేక నా
యాసలుమాని చిత్రముల యాకృతి నున్నయెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువవచ్చె మనం బదియుం దలంపవే?

చ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు పోవఁగ వీరలతోన యేను జే
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో? యటుగాక పాడిపై
వరవుడ తాపిచేయుదునో వారికి మాధవ నిశ్చయింపుమా?

అని బంధురమైన క్రొమ్ముడినుండి వెండ్రుకలు వీడ్చి, వల చేతఁబూని, మనంబున విషాదరోషములు పొంగఁగా దిగ్గన లేచి యార్తమూర్తియై బాష్పములు క్రిమ్ముకొనుచుండ, మహాభుజంగమో నావిలసిల్లు వెంట్రుకలు కృష్ణుని ముందుపెట్టి వెండియు నిట్లనియె.

కం. "ఇవి దుస్ససేన ప్రేళ్లం
దవిలి సగము ద్రెవ్వెఁబోయెఁ దక్కినయవి కౌ
రవులకడఁ దీఱు మాటల
యవసరమునఁ దలపవలయు నచ్యుత వీనిన్.

ఈ వెంట్రుకలుపట్టుకొని యీడ్చిన యాదుశ్శాసనుని తను వింతలింతలు తునియలై చెల్లాచెదరై రూపఱియున్నఁ జూచి యడుగారుగాక! మఱియొకవిధమున నారునదియా యీ చిచ్చు! ఇన్నిబన్నములు పడిన ధర్మనందనుండును, నేనును, రాజరాజు పీనుఁగు గన్నారఁ గాంచమేని భీముని బాహుబలం

బిం కేల! కాల్వనా? గాండీవమును నొక విల్లెపుడుఁ బట్టుకొని యుండు నర్జునుని విక్రమ మేల! మండింపనా?

ఇంతకాలము నామదిలో నీయల్కనొడిలో పెద్దచిచ్చు గట్టుకొన్నట్లు నిల్పితి. దుష్ట నిగ్రహాబుద్ధితో జగంబులఁగాంచు పట్టి తోఁబుట్టువవు నీవును, దేజమునఁబోల్చు భర్తలును గలుగగా నా యీ చిచ్చునకు నాఱు లెన్నడును బుట్టదా.”

అని మెలఁగు రాలుపడనేడ్చిన యాజ్ఞసేనింగని కృపాయత్తచిత్తుండై శ్రీకృష్ణుం డూరార్చి, కూర్చుండ నియమించి కన్నీరుదుడువను జెన్నటివేణిముదువను దగువారి నియోగించి యమ్మానినితో నిట్లనియె.

“సోదరీ! నేనుండఁగా గ్రుమ్మచ్చెర నేల! నాకుభీమార్జునులు తోడుగాఁగ ధర్మసుతుండు పంపఁగా నీకుమెచ్చుగా శత్రు సంక్షయముఁ జేయుదు. మఱియొక విధము లేదు. దురాత్ములగు కౌరవులింతకే యుర్వియిత్తురా? ఇప్పటి నీయేడ్పుల కొలఁదియె కురురాజపుత్ర కళత్రంబుల యేడ్పులు. వానినిఁ గలకలనవ్వుచు వినెడికాలము సమీపించినది. యముని మహిషము ఘంటికా నినాదములువిన గుతూహలముగల కౌరవులకుసంధి కార్యములు శాంతవచనములు నిష్టములగునా! ఇది విధినియతి. మేరువుతిరిగి నను దప్పను. నా పల్కనది వినుము. త్వరలో రిపుక్షయంబు చేసి పాండుకుమారుల రాజ్యశ్రీ సమేతులగుదురు. నీవు జూతువు. ఇం దసత్యము లేదు.”

ద్రౌపదియుఁ దేఱుకొను చిత్తవృత్తితో నేడ్పుడిగి శాంతింబొందె.

మరునాఁ డరుణోదయంబున శ్రీకృష్ణుండు పాండవ సందేశములం గొని కరినగరోన్ముఖుండయ్యె. అందుదుర్యోధనునితోఁ జెప్పవలయు మాటలన్నియు జెప్పె. సంధిప్రయత్నములు విఫలములయ్యె. పాండవ కౌరవులు యుద్ధసన్నద్ధులైరి. పదునెనిమిది దినములు ఘోరరణంబు జరిగె. కౌరవ పక్షంబున భీష్మద్రోణ కర్ణాదులు నిహతులైరి. తుదకు దుర్యోధనుఁడును భీము గదాఘాతంబునఁ దొడలు విఱిఁగి పడియుండె. ఈ వార్త సమీప ప్రదేశంబున మెలంగుచున్న యశ్వత్థామ కృపాచార్య కృతవర్మలు విని సత్వరంబు నటకుఁ జనుదెంచి, దుఃఖస్థులై పడియుండియు నొవ్వందొరుఁగక యున్నదుర్యోధనుని చుట్టు మూలు మేనులతో నాసీనులైరి. అందు గురునందనుం డరుణ నేత్రుఁడై పాండవుల యెడ నీసును రోషంబును బొంది యవుడుగఱచి కఠినాక్షర కలితంబుగా "ఇదె పోయి భూమి నపాండవముఁ జేసెద. పనుపుము" అనిన దుర్యోధనుండు హృష్టుండై గురునందనునకు సర్వ సేనాధిపత్యాభిషేకం బాచరించె. ఆ రథికత్రయంబు ప్రతిజ్ఞా నిర్వహణార్థము జనిరి.

అంత నర్ధరాత్రమున నశ్వత్థామ కృపకృతవర్మలతోఁ బాండవశిబిరంబు కరిగి ధృష్టద్యుమ్నుండాదిగాఁగల పాంచాల లోకంబును, దక్కటి భూపాలురను ద్రౌపదీ తనయులను, సుఖ నిద్రఁజెందువారిని, వధియించి పేర్చి యార్చె. తోడ్తో భీకరాకారుండై దుర్యోధనునికొద్దకుఁజని పాండవులను గృష్ణసాత్యకు

లును దప్ప మిగిలినవారందఱు హతులై"రని చెప్పి యశ్వత్థామ కృపకృతవర్మలతోఁ రయగతిం జనియె.

సూర్యోదయంబయ్యె. శిబిరంబున కనతి దూరంబున నున్న పాండవశౌరి సాత్యకుల కీవార్తఁ దెలిసె. పాండవులు బంధుమిత్రపుత్రాదుల దుర్మరణంబునకు వగలం బొగిలిరి. అంత ధర్మజుండు ద్రౌపదిని దీసికొనిరా నకులుం బంచె. అతండు నుపప్లావ్యంబునకు జని సుత సోదరమరణ ప్రకారం బాతన్వికి వినిపించె.

ద్రౌపది నోరండఁ బలవించుచు, నరుగుదెంచి, యధిక శోకాక్రాంతయై యార్తిఁగూరి యాక్రందనంబు సేయ నకులుం డొయ్యన యయ్యంగన నరదంబు డించె. తోడనవచ్చిన వనితా జనంబు లవతరణంబు సేసిరి. అంత ద్రౌపది వెనుమంచునఁ దెంపఱినవనజంబును బోలె నశ్రుకణపరీతాననము చెలువడలఁగాఁ బుత్రులఁ బనుపుచుఁ జరణములు తొట్రుపడుచుండఁ గొన్ని యడుగులువచ్చి, వసుధాతలంబున వ్రాలె. వాయునందనుం డా మగువం గ్రుచ్చియెత్తి ధర్మసూను సమీపంబునకుఁ దెచ్చె. అమ్మగువ మగుడ నిలంబడి యమ్మహీపతి యాననం బాలోకించి, యొలుంగు రాలుపడఁగా "సంపదకు నొప్పగునట్లు బలగంబయి నీయొద్ద నాపుత్రులు మెలంగఁ జూడఁ జాలనైతి. విక్రమోజ్వలుఁడగు సుభద్రాపుత్రుండును వమ్మయిపోయె. అనూన సంపదలు గలిగినను మనకా కుమారులమెయువఁగా వశమగునే" అని యశ్వత్థామోద్దామకరణకరణ స్మరణంబు తన చిత్తంబు త్తలపెట్టఁ గోపంబుదీపింప నాసీనయై "భూపా! నిద్రా

సత్తుల నానుతుల ముట్టికొని గురుతనూజుఁడు క్రూరతఁ జెగటార్చె. అది యారని చిచ్చై నామదిని గాల్పఁ దొడంగుచున్నయది. దీని మాన్ప నుపాయంబు మఱియొండు లేదు. అయ్యాదయుని నామమడఁపవలయును. వేగంబ వాయుసుతుని బనిచి నేఁడటు సేయింపవేని నేను బ్రాయోపవేశంబున నీకాయంబు పేక్షింతు." అనియె.

అమ్మనుజపతి యమ్మానిని కిట్లనియె, "ఘోరమృతిఁ జెందిన సుతసోదరులు పుణ్యపురుషోచిత సుగతులఁగనిరి. వారికై వగలఁ జెద్పుట మేలె? నీకుపశమించుట కర్తవ్యంబు. అశ్వత్థామయొనర్చిన పరాభవంబునఁ బుట్టిన కినుక వాని సమయింపక పోదు. వాఁ డడవిఁగలసినవాఁడుగానోపు. సమయించుట నీకెట్లెఱుఁగనగు. చెప్పుము" అనిన నప్పొలఁతి "అప్పాపాత్మునకు సహజంబైన శిరోమణి కలదు. దానిని దెచ్చియిచ్చిన జూచి జీవంబుతో నుండెద" అనుచు బవమానతనయుని దన పాణితలంబున సంస్పృశించి క్షత్త్రధర్మము గైకొని, రయంబుమై నరిగి, గురుపుత్త్రుని ముట్టిచంపుము. నామది కనలుడిపి నన్ను రక్షింపుము. మఱియుఁ జతుగృహదాహ సమయమునఁ జూపిన పౌరుషంబుతో, హిడింబాసురుఁడు వచ్చినయపుడు గైకొన్న నిష్ఠురతతో, యక్షులు పొదవినపుడు వాటించిన దోర్బలవ్యాప్తితో గీచకుని యేచినయెడఁ బూనిన విక్రమస్ఫూర్తితో జని మనల గెలిచితినని గర్వించుచున్న యశ్వత్థామను గీటడంగింపుము."

అనిసవిని యగ్గురుసుతుదెసం బొడమినయమర్షంబున తేనువాఁగ భీమసేనుండు ద్రుపదనందనతో ధర్మనందనుం డాడినమాట లశ్వత్థామపైఁబోవుట కనుమతిగా నంతరంగంబున నంగీకరించి, కోదండగదాదండాది హేతిసంపన్నంబైన రథం బెక్కి గురుతనయాది యోధవరుల యరదంబుల చొప్పు పట్టి కొని, త్వరితగతిం జనుచుండ.

అతని వెనువెంట శౌరి ధనంజయ ధర్మరాజాదులు నరిగిరి. కొండొకసేపునకు సమీరనందనస్యందనంబును గూడికొని, వారందఱు భాగీరథీతీరంబున నొకచో గురుపుత్రుం గాంచిరి. పాండవులను గృష్ణునిజూచుటతోడ్తో వారల దివ్యాస్త్రవేదిత్వం బూహించి తలంకి యశ్వత్థామ బ్రహ్మశిరోనామకంబను దివ్యాస్త్రంబుదలంచి దాని పాండవులపైఁ బ్రయోగించె. కృష్ణుని పనుపున నర్జునుండును దానిమఱలింప బ్రహ్మాస్త్రంబు బ్రయోగించె. ఆరెండు బ్రహ్మాస్త్రములవనివ్యోమములందునిండి రవివహ్నులవలెఁ బోరుచుఁ ద్రిలోకత్రాసంబు గావించుచుండ. అపుడు మాధవునాజ్ఞచే నర్జునుఁడు బ్రహ్మాస్త్రద్వంద్వంబు నుపసంహరించి, ద్రోణనందనుఁ బట్టుకొని, బంధించె. వారందఱు శిబిరమునకువచ్చి మహాపాశబద్ధుఁడగు గురునందనుని ద్రౌపదికిఁ జూపిరి. అశ్వత్థామ లజ్జాపరాఙ్ముఖుండై యుండ. సుస్వభావ యగు ద్రౌపదిదయాంతఃకరణయై యాతనికిమ్రొక్కి యిట్లనియె.

మ॥ "పరగన్ మామగవారలందఱును మున్ బాణప్రయోగోపసం
హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి, పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు, నీచిత్తంబులో లేశమం
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే!

కం॥ భూసురుఁడవు బుధిదయా
భాసురుఁడవు, శుద్ధవీరభట సందోహా
గ్రేసరుఁడవు శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ!

శా॥ ఉద్రేకంబునరారు. శస్త్రధరులై యుద్ధావనిన్ శేరు, రౌ
ద్రోహంబును నీకుఁజేయరు బలోత్సేకంబుతో; జీఁకటిన్
భద్రాకారులఁ జిన్నపాపల రణప్రౌఢక్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా నీచేతు లెట్లాడెనో!

ఉ॥ అక్కట పుత్రశోక జనితాకులభార నిమగ్నచిత్తనై
పొక్కుచునున్న భంగి నిను బోరఁ గిరీటిని బట్టుఁ జేసినేఁ
డిక్కడి క్రిచ్చితెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ
డెక్కడ నిట్టిశోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో."

అని కృష్ణార్జునులఁజూచి యిట్లనియె, "బ్రాహ్మణహింస పాపము. కాన విప్రవధ మానునది.

ధర్మంబును సకరుణంబును నిర్వ్యాళీకంబును, సమంబును శ్లాఘ్యంబును నగు నీ ద్రౌపదిపలుకునకు నందఱు సమ్మతించిరి. మొదట సమ్మతింపకయుఁ బిదప వాయుసుతుండొడఁబడియె.

అంత కృష్ణానుమతంబున నర్జునుఁ డశ్వత్థామ శిరోజములు దఱఁగి, మహారత్నమును బుచ్చుకొని, యాతని బంధవిముక్తునిఁ జేసె. అశ్వత్థామయు సిబ్బితితో నొడలి గబ్బుచెడి చనియె. ఆరత్నమును ద్రౌపది ధర్మజునకిచ్చె. ధర్మజుఁడును దానిఁదాల్చి యుదయరాగ సముజ్జ్వల చంద్రబింబంబున నొల్చు పూర్వశైలంబువోలె నొప్పారె.

# పదునాల్గవ ప్రకరణము

పాండవులు యుద్ధనిహతులైన సకల బంధుమిత్ర జనంబులకు నుదకకర్మం బాచరించి గంగాతీరంబున నశుచిత్వం బపనయించుటకై యొక్క సమస్థలంబునఁ బటకుటీర సంవిధానంబు చేయించి నివసించుచుండిరి.

అందులకొకనాఁడు పారాశర్యుండేతెంచి ధర్మరాజుతో "సకలజనప్రియహితంబగు పృథ్వీరక్షణంబు నీకుఁ గులధర్మంబై కర్తవ్యం బగుట యెఱుఁగవుగాదె?" యనుడు నమ్మునీంద్రునకు నమ్మనుజేంద్రుం డిట్లనియె. "ప్రేమతోఁ దొడలపై నిడికొని బాల్యమున మమ్ములాలించు భీష్మునిజంపుకొంటిమి. అత్యల్ప కాల భోగ్యమగు నీ రాజ్యమున కాశించి యనల్పకీర్తియునుండును జరఠసింహకల్పుఁడును నగు మాపితామహుని ద్రుంచిన మా మనము లింకను వగలఁ జివుకకున్నయవిగదా?

మఱియు రాజ్యలాభలోభరతుఁడనై యత్యంత పాపాస్పదానృత వాక్యంబులాడి గురుని గూల్పనేర్చిన క్రూరాత్ముఁడను. నేనేగతికిఁ బోవుదునో.

మహావీరుండును, దానవీరుండును నగు కర్ణుని మా భ్రాతను జంపించి, పాలించు నవనీరాజ్యమును మాకు నాతురత సేయఁగాని సుఖము నొసంగునా?

మీఁదు మిక్కిలి సుభద్రాతనయుని ద్రౌపదీ తనయులను జంపుకొంటి. ఇది తుంతర్యముగాని దోషము. ఇక ద్రౌపది గృహ భారము నిర్వహింప నెట్లోపును?

ప్రాణోపవేశముచేసి యిత్తనువు దొఱఁగు తలంపు గదిరెడి. సంతాపాయత్తచిత్తుడను. "పాపమకటకటా" యని పోనిండు. రాజ్యపరిగ్రహ పరత్వంబు మచ్చిత్తంబునం గలిమిం జేసి కిల్బిషంబంత్యంతంబు నాచరింపవలసె. పరిగ్రహ దోషంబు పరిగ్రహత్యాగంబునంగానిపోదు. తక్కినసోదరులు రాజ్యం బేలుకొందురుగాక! నేను గాననంబునకుంజని మునిజన సంకా శంబున సుఖినై యుండెద.

ధర్మజుని బుద్ధిం ద్రిప్ప సోదరులు నలువురు ప్రయత్నిం చిరి. పెక్కురు మునీశ్వరులుం, దర్శనాగతు లుపదేశించిరి కాని ధర్మజుఁ డెప్పటి యట్ల చింతాక్రాంతుఁడై యుండెను.

తదనంతర మతని మొద సవిశేషబహుమానయు, నతని చేత సంతోషోపలాలితయు, ధర్మాధర్మనిదర్శనశీలయు నగు పాంచాలి యన్నరేంద్రు నల్లనచేరి, యాతని వదనంబున నిజ విశాలలోచనరోచులు పరఁగ, వినయం బాననంబున నటిత యిల్లఁగా నిట్లనియె. "మహాత్మా! శోకాగ్నిచే సొగయు నీ తమ్ములను వాక్యామృతమునఁ దేర్పుము. కానలయందుఁ ద్రిమ్మరునాఁడు ఏరాయాసములు పడుటచూచి "సుయోధనుని జంపి భోగయోగత్యాగంబుల నలుపుదము"ని యూరడించు చుండువాడవు గదా! ఇపుడు వారల నుడికింపఁ దగునా? ధర్మ సత్యములను నీకంటె నెఱిగెడువారు కలరా?

మఱియు నరేంద్రునకు మనస్సు పేదయగుట ధర్మపు గాదు. అతండు శిష్టుల రక్షింపను, దుష్టులశిక్షింపను నర రూపమునఁ బరగెడి పరదేవత. అటుగావున రాజవగు నిన్నుఁ

పరాభవించిన యాదుష్టులు భవత్ప్రకోపశిఖిఁ గ్రాఁగిపోయిరి. దీనికై వగపేల!

అదియుంగాక నన్నుఁ దలపట్టియీడ్చిన తప్పును దనదు తొడలు సూపిన తప్పును, నికృష్టవచనములఁ దఱిచిన తప్పును దుశ్శాసన దుర్యోధన కర్ణులయందుఁ గాంచి, వారి దండించితివి. ఇందుఁ గల్మషం బేమిగలదు?

దండార్హులను దండింపని పక్షముననే సుమీ! భూవిభుఁడు గొప్ప కిల్బిషము వొందుట."

అని యంతనిలువక చనువుమెఱసి మేలంపుచందంబున:

ఉ॥ వైదికధర్మచారి జనవర్ణ్యుల నీమదిఁబట్టుకొన్న యా
స్వాదము హీనమానవ మనంబున బుట్టిన వెట్టివోలెన
ప్యాదులఁదీర్చుటొప్పదు నిజానుజవర్గముమీఁదఁ గల్గిన
ఖ్యాదర సాంద్రసారకరుణామృత మానఁగనిమ్ము చెప్పదిన్.

మఱియు నాయట్లిడుములఁ బడిన యంగన లెందైనఁ గలరా? అట్టి నేనును నీకు ధర్మాపాయము గలుగునని గృహధర్మవృత్తిఁ బాయకుంటిని.

దీనికింత చింతయేల? తమ దుఃరితమ్మునఁ గౌరవులు తా రేఁసిరి. దానఁ గల్మష మేమి గలదు? భూభారము సహింపఁ దెమ్మా. బహుయజ్ఞారంభణ మఖిలహితముగా నాచరింపుము. దేవపూర్వ దేవగురువులు పలికిన దండనీతియందు నీవు పరిణతుఁడవు. నీకు జెప్పవలయున దేమి?" అని పలికె.

అంత నట్టికేలకుఁ బలువురు బోధింపఁ జిత్తంబు కలంక దేఱి కౌంతేయాగ్రజుండు రాజ్యభారనిర్వహణోత్సాహం బంకు

ంపగా శశిరాజగ సమయకమలంబు ననుకరించు వాసనం
బుతో నందలి మునివర్యులకుఁ బ్రదక్షిణంబును, బ్రణామం
బును నాచరించి వారలవలన వివిధాశీర్వాదంబులం బడసి
వెలింగె. వారును నిజస్థానంబులకుఁ జనిరి.

మఱునాఁడు ధర్మజుఁడు కల్యంబునఁ గాలోచిత కృత్యం
బు లాచరించి, ధవళానులేపన మాల్య వస్త్రాభరణంబుల
నలంకృతుండై, షోడశధవళహారులఁబూన్చిన రథం బెక్కి, ధృత
రాష్ట్రుని నతని దేవినిఁ బ్రభూతాందోళికారూఢులం జేసి పుర
స్కరించుకొని, విదురుండు కుంతి ద్రౌపదీ ప్రముఖ స్త్రీజనం
బుల నందలంబుల నిడికొని వెనుక నడువ, నరేంద్రులు నానా
ముఖంబునఁ దమతమ సేనలతోడం గూడం గొలిచి చను
దెంచుచుండ, బ్రయాణించి కరినగరంబుసేరి మహావైభవంబు
మెఱయ నభిషిక్తుఁడై సుఖముండె.

# పదునేనవ ప్రకరణము

జయశ్రీ యుల్లసిల్ల ధర్మజుండు ముప్పదియైదు వత్సరంబులు ప్రజానురంజకముగా రాజ్యపాలనం బొనర్చె. అనంతర సంవత్సరమున శ్రీకృష్ణుని పరమానందపద ప్రాప్తియు, బలభద్రుని యనంతత్వసిద్ధియు, సకల యాదవ మౌసలాహవ ప్రకారంబును నెఱింగి ధర్మజు మహాప్రస్థానంబునకు మది వొలయఁ దద్వృత్తాంతంబు ద్రౌపదికి, సోదరులకు నెఱింగించి వారికి నదియు, హితంబును, నభిమతంబునని యెఱింగి, యభిమన్యు పుత్రునకుఁబట్టముగట్టి, ధౌమ్యాదివిప్రులకుఁ దృప్తిగా బహువస్తుకోటులనొసఁగి బయలుదేర. భీమార్జున నకుల సహదేవులను ద్రౌపదియుఁ గ్రమమున ధర్మజు ననుగమించి చనుచుండిరి.

అక్కురువంశ వరులను జూడ పౌరజనంబు లాబాల వృద్ధంబుగావచ్చిరి. తత్సమయంబు జూదమునాఁడు వెడలి వారరిగెడు నవసరమును బోలియుండె. ప్రజలందఱు వారి వెంబడించి యరుగుచు ధర్మరాజును "నిలుమ"ని ప్రార్థించుచుండిరి. ధర్మజుఁడు తలవాంచి సోదర ద్రౌపదీ సహితుండై వెడలుచుండె. ఇట్లు ప్రజలందఱుఁ గడుదవ్వరిగి తనువులు దూలఁగా వారికిఁ బ్రదక్షిణ ప్రణామంబు లాచరించి, వారి వీడ్కొని పట్టణంబు సేరంజనిరి. పాండవులును ద్రౌపదియు నుపవాసవ్రతముతో భాగీరథీప్రాంతమునకుఁ జని, యంత నుండియుఁ బ్రాఙ్ముఖవర్తనంబు గైకొని,యోగబలంబున నరిగి

గిరి సరి దరణ్యంబు లనేకంబులు గడచి పూర్వసముద్రతీరంబు సేరిరి. తదనంతరము దక్షిణాభిముఖులై దలకొని భూప్రదక్షిణంబుగాఁ బడమర మొగమై పశ్చిమ జలనిధితీరంబు సేరిరి. అటనుండి యుత్తరము నడచి హిమాచలము నతిక్రమించి యోగబలముచేత గతఖేదులై మేరుసమీప భూమికిం జనిరి.

అందు నతిసత్వరగతిఁ బ్రయాణించుచో నొకచోఁ బాంచాలరాజపుత్రి యోగకొండలి మేదినిం బడిపోయె. క్రమముగా సహదేవ నకులార్జున భీములును పడిపోయిరి. ధర్మజుఁడు ఇవి ఏమియు లెక్కచేయక స్వర్గమును చేరెను.

శ్రీ కృష్ణార్పణమస్తు.

Bharathi Press, Tenali. P. I. C. G. 36. C 2000-15-7-47.